# వర్ణనాత్మక వ్యాకరణం

## (DESCRIPTIVE LINGUISTICS)

డా. ఎచ్. ఎస్. బిళిగిరి

కన్నడంనుండి తెలుగుసేత :

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

అభివ్యక్తి ప్రకాశనం

బెంగళూరు

VARṆANĀTMAKA VYĀKARAṆAM

Telugu Translation of the Kannada Version -
Varnanatmaka Vyakarana

By Dr. H. S. Billigiri, Deccan College,
Post Graduate & Research Institute, Poona-6,

*Translated from Kannada*
By G. LAKSHMINARAYANA
Lecturer in Telugu, Christ College, Bangalore-29.

First Imprint — 1975



Rs. 3-50

ABHIVYAKTI PUBLICATIONS
Bangalore

Copies can be had from the Translator.

*Printers :*
FREEDOM PRESS
138-A, T. H. ROAD,
MADRAS-600021.

# అనువాదకుని కృతజ్ఞతలు

తెలుగువాళ్ళకు ఆచార్య భద్రిరాజుగారు ఎంతటివారో, కన్నడిగులకు ఆచార్య హెచ్. ఎస్. బిళిగిరిగారు అంతటివారు. ఆధునిక భాషాశాస్త్రానికి కన్నడదేశంలో శుక్లాంబరధరం పాడింది వారే. సరసులు, సహృదయులు, సారమెరిగిన విద్వాంసులు, చక్కటి కవులు, అన్నింటినీమించి వీణాశ్రవణ మంటే సమస్తాన్ని మరచిపోయేవారు. వారే కనుక పూర్తిగ మనసుపెట్టి కూర్చుంటే ఆకృతిశాస్త్రం (Morphology) మీద సర్వోత్కృష్టమైన పుస్తకం వస్తుందని ఎందరో ఆశిస్తుంటారు. భారతదేశంలోని వర్ణనాత్మక భాషాశాస్త్రజ్ఞుల్లో డా॥ బిళిగిరిగారు అగ్రస్థానీయులని మరెందరో పండితు లంటుంటారు. అంతటి సరస విద్వాంసులవద్ద పరిశోధకవిద్యార్థిగా చేరడం నా పురాకృత పుణ్యఫలం.

బెంగుళూరు విశ్వవిద్యాలయంయొక్క ఆహ్వానాన్ని పురస్కరించుకొని, 69 లో వారు సామాన్యవిద్యార్థులను ఉద్దేశిస్తూ సరదాగా, సరళంగా వర్ణనాత్మక భాషాశాస్త్రం మీద మూడు ఉపన్యాసాలను ఇచ్చారు. కన్నడ విభాగంవారు 'వర్ణనాత్మక వ్యాకరణ' అన్న పేరుతో దాన్ని తమ తొలి ప్రకటనగా సమర్పించారు. తెలుగులో ప్రతి విశ్వవిద్యాలయంలోనూ భాషాశాస్త్రం అధ్యయనవిషయమైనా, ఇందాకా ఏ గ్రంథమూ లేదు. అలాంటప్పుడు ఈ చిన్నపుస్తకాన్ని తెలుగులోకి తర్జుమాచేస్తే చాలా ఉపయుక్తంగా ఉంటుందనిపించింది. అందుకు గురుదేవుల ఆమోదముద్ర లభించడం నా అదృష్టం. వారికి నా మొట్టమొదటి కృతజ్ఞతాంజలిని ఘటిస్తున్నాను.

అనువాదంయొక్క వ్రాతపతిని ఆమూలాగ్రం సరిచూసి, చక్కటి సలహాలనిస్తూ సంతోషంగా పుస్తక ప్రకటనకు ప్రోత్సాహమిచ్చినవారు డా॥ పి. ఎస్. సుబ్రహ్మణ్యంగారు. (Reader in Linguistics, Annamalai University).

అసలీ అనువాదానికి తొట్టతొలి ప్రేరేపకులై, మంగళాశంసనం పలికినవారు డా॥ ఎమ్. చిదానందమూర్తిగారు (Professor of Kannada, Bengalore University).

అయితే ఆర్థికసహాయాన్ని అందిస్తూ ఈ అనువాదం ఇలాటి రూపాన్ని పొందడానికి కారణమైంది - మిత్రులు శ్రీ ఎస్. కె. మైత్రాగారు (Manager, Syndicate Bank, Wilson gardens, Bangalore).

వీరందరికీ నా అనేక నమస్సులు. వీరితోపాటు అవసరమైనప్పుడు అర్థాలు చెప్తూ, అనువాదంలో సాయపడ్డ మిత్రుడు శ్రీ పి. శ్రీనివాసరాజుకూడా అభి నందనీయుడు.

ఇందులో బుద్ధిపూర్వకంగా డా॥ విశిగిరిగారు వాడిన పారిభాషికపదాలను అలాగే వాడాను. విశ్వాత్మికంగా చూస్తే వాటి స్వారస్యం, శ్రేష్టతా అర్థం కాకపోవు. అలాగే కన్నడప్రభావం బాగా అగుపించే కొన్నిపదాలను కావాలని వాడాను. 'సమర్పకత' అన్నది సమంజసము అన్న అర్థంలో, 'యమళత' అన్నది సంశ్లేషము అన్న అర్థంలో బుద్ధిపూర్వకంగా వాడినవే. వీటిని సోదర ఆంధ్రవిద్యార్థి లోకం దోషాలుగా పరిగణించకుండా, మన్నిస్తుందని ఆశ.

బెంగుళూరు
1-11-75

గంగిశెట్టి లక్ష్మీనారాయణ.

కొన్ని వారాలక్రిందటనే మానవుడు చంద్రలోకంలో రెండవపర్యాయం పర్య టించి వచ్చాడు. కేవలం పదివేల కిలోమీటర్ల దూరంనుండీ కుజగ్రహ ఛాయాచిత్రాన్ని తీశాడు. ఇక రెండు మూడు శతాబ్దాలలో మానవుడు నక్షత్రాలనుకూడ తాకి రాగలడని ఆశావాదులు నమ్మకంతో ఉండవచ్చు. తననూ, తానున్న భూమినీ పొడిపొడిచేసి నాశనం చేస్తాడని నిరాశావాదులు భయంతో ఉండవచ్చు. మానవుడు మానవుడే కావడం వల్ల ఈ వైపరీత్యాల్లో ఏది సంభవించినా ఆశ్చర్యం లేదు. మానవుడు మానవుడు కావడం ఎలాగంటే 'భాషవల్ల' అన్నదే సమాధానం. మాట్లాడే మర్కటాలే మానవు లనడం అక్షరాలా సత్యం.

మానవుని ఉన్నతికి ఎలాగో, అలాగే గతికీ కారణమయ్యే భాషాస్వరూపాన్ని, అది ఎలా పని చేస్తుందనేదాన్ని మనం తెలుసుకోవాలి. అంచేత సమగ్రస్వరూపాన్ని కాకపోయినా, దాన్ని గురించి పరస్పరం సంబంధం లేనట్లగుపించే కొన్ని విషయాలను విడివిడిగా తెలిసికొందాము.

భాష అనేది జనువంశికంగా వచ్చేదా? లేక సంప్రదాయపరంపరలమూలంగా వచ్చేదా? అన్న చర్చ కావలసినంతగా నడచింది. ఈ చర్చలో కావలసినంత వ్యాకులత కూడ తలెత్తింది. ఎలాగైనా కాని, నిస్సంశయంగా అగుపించే నాలుగు సన్నివేశాలను గమనిద్దాము.

కోతుల్లో నెఱజాణ అనిపించుకొన్న ఒక చింపాంజీ పిల్లను మన ఇంట్లో ఉంచు కొని, మనపిల్లల్ని పెంచినట్లే పెంచుదాము. అది పెద్దదయ్యాక కన్నడం కాదు కదా, ఇంకేభాషనూ నేర్చుకోలేదు.

మునుపటిరోజుల్లో మహారాజులు, బిడ్డను పుట్టినవెంటనే కారడవుల్లో ఉంచి రావడం, మానవసంపర్కం అన్నది లేకుండా, దాని ప్రాణానికి అపాయంలేనివిధంగా పెంచిన కథలను మీరు వినేఉంటారు. పత్రికల్లో అప్పుడప్పుడు జంతువులమధ్య పెరి గిన పిల్లల విషాదకరవార్తలు రావడంకూడ కద్దు. ఇలాటి 'సన్నివేశాల్లో' పెరిగిన మానవశిశువు ఏభాషను నేర్చుకోవడం లేదు. ఎందరో పిల్లలు, దురదృష్టవశాత్తు,

పుట్టుకతోనే మూగవాళ్ళుగా, చెవిటివాళ్ళుగా పుడుతుంటారు. ఆ పిల్లల్ని జాగ్రత్తతో, ఆదరంతో పెంచామంటే, పెద్దయ్యాక వాళ్ళలో ఎందరో మాట్లాడ్డం నేర్చుకొంటారు. ధ్వని నిర్మాణానికి ఉపయుక్తమయ్యే అవయవాలు పాడయ్యాయంటే, మామూలుగా మాట్లాడ్డం కాకపోయినా, ఒక ప్రత్యేకరీతిలో భాషాప్రయోగాన్ని అలవాటు చేసి కొంటారు.

కన్నడం మాట్లాడే ఇంట్లో పుట్టినబిడ్డను ఆఫ్రికాలోని స్వాహిలీకుటుంబంలో పెట్టి చూడండి. ఆ బిడ్డడు నేర్చుకొనేది కన్నడం కాదు, స్వాహిలీనే.

ఈ నాలుగువిషయాలమూలంగా భాష అనువంశికమా? కాదా? అన్న సమస్య. సమస్యగానే మిగిలి, పరస్పర వైరుధ్యంలేని రెండువిషయాలు వెలుగుకు వస్తున్నాయి. ఒకటి: జీవభాష అన్నది నేర్చుకోగలిగేదా?... అథవా ... నేర్చుకోరానిదా? అన్న ప్రశ్న నేరుగా అనువంశికతకు సంబంధించినది. భాషను నేర్చుకోలేని ప్రాణి, దేన్ని నేర్చుకొంటుందన్నప్రశ్న సంప్రదాయపరంపరలకు సంబంధించినది. అందువల్ల మాన వుని మానవునిగా చేసేభాష అనువంశికమైనది. పుట్టుకతోనే శిశువు, భాషను నేర్చుకో గలశక్తిని బీజరూపంలో పొందే పుడుతుంది. అయితే, ఈ శక్తి ప్రకటమయ్యేందుకు, నేర్చుకొనే భాష ఏది? అన్నదానికి సంప్రదాయం, పరంపరలసహాయం అవసరం.

ఏ భాషైనాకాని, దాన్ని మాట్లాడేవాని ఉచ్చారణాంగాలు. చెవులూ అభ్యాసబలం వల్ల ఒకరకమైనపద్ధతికి అలవాటు అవుతాయి. ఈ పద్ధతినే ఆ భాషయొక్క ధ్వని వ్యవస్థ అని పిలుస్తారు. ప్రతిభాషకూ ఇలాటి ధ్వనివ్యవస్థ ఒకటి ఉంటుంది.

మాటాడే ప్రతిమనిషీ తనకు తెలియకనే ఉచ్చారణయొక్క లక్ష్యబిందువు లన తగ్గస్థితికి తన ధ్వన్యంగాలను అలవాటు చేస్తాడు. ఉదాహరణకు బా అన్నదాన్ని వెలు వరచేటప్పుడు మొదట మూడు లక్ష్యబిందువులను ఏకకాలంలో అతడు సాధించాల్సి ఉంటుంది. తన రెండు పెదాలను క్షణకాలం కలపాలి. మృదుతాలువును పైకిలేపి నాసికాద్వారాన్ని మూయాలి. స్వరతంతువులను బిగించి, గాలిని నోటోకి పంపుతూ, ఆ ఒత్తిడితో వాటిని కంపించేలాగ చేయాలి. ఒక వ్యంజనానికే ఇంత ప్రయత్నం చేయాలి. వేగంగా మాట్లాడేటప్పుడు ధ్వనులు ఒకదానిమీద ఒకటిగా వెలువడేటప్పుడు, ప్రతియొక్క ధ్వనికీ ఇలాటి సముచితప్రయత్నాలను చేయడమేకాదు, ముందు రాబో తున్న ధ్వనులకు అనుగుణంగా వెంటవెంటనే ప్రయత్నాలను మార్చుతుండాలి.

నిత్యమూ మాట్లాడి, ధ్వన్యంగాలమీద అతడు ప్రభుత్వాన్ని సాధిస్తాడు. ఈ ప్రభుత్వం ఎంతవరకు వస్తుందంటే, మాట్లాడేమనిషి, తానేమి చెబుతున్నాడో గమనించుకోవచ్చు కాని, ఏ ఏ ఉచ్చారణాంగాలు ఎలా ఎలా కదులుతున్నాయో అతనికే తెలియదు. మృదుతాలువంటే ఏమిటి? జిహ్వామూలీయమంటే ఏమిటి? అన్నది చిత్రసహాయంతో చూపి, కకారోచ్చారణలో జిహ్వామూలీయము, మృదుతాలువును తగులుతున్నదన్నప్పటికీ, క క క అని పలుమార్లు ఏకాగ్రతతో ఉచ్చరించాక, ఈ మాటలు మన ఎరుకకు రావచ్చు. మనకు మన ఉచ్చారణాంగాలమీద ఉన్న ప్రభుత్వం ఇలాటిది. ప్రభువన్న వాడు ఎప్పుడూ నిరంకుశుడే. అలాగే అతడు నిరంకుశుడై ఉచ్చారణను చేస్తాడు.

మాట్లాడేవాడికథ ఇలాగుంటే, మాట వినేవాడికథకూడ అంతే. చెప్పినది అర్థం చేసుకోనేడు, చెవిసహాయంతో అన్నది - అతని స్ఫురణకు రాదు. చెవి కేదైనా జరిగి కాస్త దూది దోపుకొన్నాకనే మనకు చెవియొక్క యోచన వచ్చేది. మాటాడేవాడు నత్తినత్తిగా మాట్లాడనీ, నోట్లో పొగాకు పెట్టుకొని మాట్లాడుతుండనీ, చుట్టుప్రక్కల గలాటా జరుగుతుండనీ, అతడు చెప్పేది మనకు అరమౌతుంటుంది.

మాట్లాడేవానికి తాను చేసే శబ్దాలమీద దృష్టిలేకున్నా చెప్పాలనుకొన్నదానిని ఎలాగ చెప్పగలడో, అలాగే వినేవాడుకూడ తన చెవిమీద వచ్చిపడే శబ్దాలమీద దృష్టి లేకున్నా, చెప్పినదాన్ని తెలిసికోగలడు. ఇలాటివ్యవహారం సాధ్యమయ్యేది, వాళ్ళిద్దరికీ సామాన్యమైన ఆ భాషలోని ధ్వనివ్యవస్థ వల్లనే.

ఏ భాషైనాకాని, కేవలం ధ్వనివ్యవస్థ అన్న ఒక్కదానివల్లనే తన కార్యాన్ని నిర్వహించలేదు. ధ్వనుల చేరికవల్ల ఏర్పడ్డ అర్థవంతమైనశబ్దాలు భాషలో కనిపిస్తాయి. అర్థమంటే ఏమిటన్న చర్చలోకి దిగడం, ఎర్రచీమలబారులో చేయిడినట్లే. మన కందరికీ 'అర్థ' మన్న శబ్దార్థం నిక్కచ్చిగా కాకపోయినా, అస్పష్టంగానైనా తెలుసు. ఈ నిరూపణకు ఆమాత్రపు అస్పష్టమైన అర్థమే చాలు.

ఏ భాషలోని శబ్దాలైనా, ఆ శబ్దాలకు - శబ్దార్థాలకు ఉన్నసంబంధం సహజమైనది కాదు. ఈ శబ్దానికి ఈ అర్థమన్నది నేర్చుకోకనే రాదు, హెచ్చుతక్కువగా ఒకే అర్థాన్ని ఇచ్చే, విభిన్నభాషలలోని శబ్దాలను పోల్చిచూస్తే ఈవిషయం స్పష్టమౌతుంది. కన్నడంలో నాయి (కుక్క), ఇంగ్లీషులో డాగ్, హిందీలోని కుత్తా, జర్మన్‌లోని

హంట్, ఖడియాభాషలోని సొలోగ్ అన్నపదాలు ఈ మాటను నిర్ధరిస్తాయి. ఒక పెద్ద మాటతో వర్ణించాలంటే శబ్దార్థాలసంబంధం యాదృచ్ఛికమైనట్టిది. ఈ మాట మిగిలిన ప్రాణులవిషయంలోకూడ నిజమే. ఆహారాన్ని చూపినపుడు, ఏ ఏ జంతువులు ఎలా అరుస్తాయో విని చూడండి. ఆహారాన్ని చూడ్డానికి, ఆ ప్రాణుల అరుపులకు సంబంధం లేదని విదితమౌతుంది.

ఒక భాషయొక్క ధ్వనివ్యవస్థ నిర్వహించేపాత్రను ఇలా చూడవచ్చు. శబ్దాలను వేరువేరుగా ఉంచేవవి ధ్వనులది. కాఫీకి చక్కెర కావాలని కేకేస్తే, ఎవరూ ఉప్పును తీసికొనిరారు. 'చక్కెర' అన్న శబ్దాన్ని 'ఉప్పు' అన్న శబ్దాన్ని వేరువేరుగా ఉంచుతున్నది, ఆ శబ్దాలలోని ధ్వనులే. కొన్నిసమయాల్లో ఒకే ఆనుపూర్వి ఉన్న ధ్వనిసముదాయానికి ఒకదానికంటె ఎక్కువ అర్థాలు ఉండడమూ నిజమే. జలక్రీడ లాడుతున్నప్పుడు 'మోదకైస్తాడయ' అన్న సుందరి పలుకునువిని తీపికుడుములను తెప్పించిన రాజు కథ మీరు వినిఉండవచ్చు. ఇలాంటి సంధిగ్ధార్థం కల శబ్దాలు అన్నిభాషల్లోనూ ఉంటాయి. కాని సందర్భంమూలంగా సందిగ్ధతలు తలెత్తవు. అంతేకాదు, అలాటి శబ్దాలను ఉత్తమకవియైనవాడు ప్రయోగించి చమత్కారాలను సాధిస్తుంటాడు కూడ.

ధ్వనులు శబ్దాలను వేరువేరుగా ఉంచగలవన్నాను. ఈమాట ఇతరప్రాణుల విషయంలోకూడ సత్యమే. కుక్క 'కుంయ్' అనడానికీ, 'గుర్' అనడానికీ, ఎవరినైనా చూపినపుడు 'భౌ భౌ' అనడానికీ వ్యత్యాసమున్న విషయాన్ని కుక్కలే ఎందుకు, మనంకూడ తెలిసికోవచ్చు. కుక్కచేసే ఈ శబ్దాలు, ఆ శబ్దాలనుండీ వ్యక్తమయ్యే విభిన్నభావాలను వేరువేరుగా ఉంచుతున్నాయి. కాని జంతువులు చేసే ఈ శబ్దాలకు, మనుష్యులుపయోగించే శబ్దాలకు ముఖ్యమైన తేడా ఒకటుంది. 'కుంయ్' అన్న శబ్దానికీ, 'గుర్' అన్న శబ్దానికీ ఉన్నభేదం అనంతమైనది. 'గుర్' అన్న శబ్దంలోని ఏ అంశాలూ, 'కుంయ్' అన్నదాంట్లో కనిపించడం లేదు. అయితే మానవుడు వాడే భిన్న శబ్దాలకున్న వ్యత్యాసం, వానిలోఉన్న ధ్వనులవల్ల కలుగుతోంది. ఈ ధ్వనులు ఇతర శబ్దాల్లోకూడ అగుపిస్తూనే ఉంటాయి. ఏ శబ్దమన్నాకానీ, నిశ్శేషంగా ధ్వనుల ఆనుపూర్వితగా విడదీయవచ్చు. విడివిడిగా ఈ ధ్వనులకు అర్థం లేకున్నప్పటికీ, అవి శబ్దాల్లో మళ్ళీ మళ్ళీ కనిపిస్తుంటాయి. ఉదాహరణకు: *మరి* అన్న శబ్దాన్ని చూడండి. మ్+అ+ర్+ఇ అని నాలుగు ధ్వనులుగా విడదీయవచ్చు. ఈ ధ్వనులకు ప్రత్యేకమైన అర్థమంటూ లేదు. ఈ నాలుగుధ్వనులూ అగుపించేది 'మరి' అన్న ఒక్క శబ్దంలోనే కాదు. మ్ అన్నది *మర, మొర, అమె, అమ్మ* మొదలైన అనేకశబ్దాల్లో వస్తుంది.

*అ* అన్నది *అర, అక్క, గిఢ* మొదలైన అనేకశబ్దాల్లో కనిపిస్తుంది. అలాగే *ర్* అన్నది, *ఇ* అన్నది అనేకానేకశబ్దాల్లో వస్తుంటాయి.

ఈవిధంగా అర్థంలేని కొన్ని అంశాలనుమాత్రం వాడి, సహస్రాధికంగా అర్థవంతమైన శబ్దాలను తయారుచేసే వ్యవహారవ్యవస్థలో 'ద్వైవిధ్యం' ఉన్నదని లెఖ్ఖిస్తారు. ఏ వ్యవస్థలోనైనా కాని, బహుసంఖ్యాకమైన అర్థవంతశబ్దా లుండాలంటే, ఈవిధమైన ద్వైవిధ్యం ఒక లాఘవాన్ని సంతరిస్తుంది. బుద్ధిపూర్వకంగా ఇలాటి వ్యవస్థలను నిర్మించేటప్పుడు అతిశయమైన లాఘవాన్ని ఏర్పడేలాగ చేయొచ్చు. ఉదాహరణకు: మోర్సుకోడ్ (Morsecode) యొక్క వ్యవస్థను చూడండి. ఈ వ్యవస్థలో అర్థంలేని అంశాలు మూడే, బిందువు, గీత, ఖాళీస్థలము. రెండుచుక్కలు ఒక ఖాళీ జాగా ఉంటే, 'I' అన్నసంజ్ఞ. మూడుచుక్కలుంటే 'S' అన్నసంజ్ఞ. ఇత్యాది.

ఈ లాఘవం ఎలా లభిస్తుందన్నది జంతువులభాషను పోల్చిచూస్తే స్పష్టమౌతుంది. జంతువుల భాషలోలాగ ఒక ధ్వనికి ఒకే అర్థం అన్న వ్యవస్థఉంటే, వేయిన్నారు అర్థాలను వ్యక్తీకరించడానికి వేయిన్నారుశబ్దాలు ఉండాల్సివస్తుంది. దానికి బదులు, కొన్ని ధ్వనులనుమాత్రమే ఉంచుకొని, వాటినే వివిధరీతుల్లో జతపరచి శబ్దాలను నిర్మించుకోవడంవల్ల సంక్షిప్తత - లాఘవం లభిస్తోంది.

ఏ మానవభాషైనా కానీ, అందులో ఇలాటి 'ద్వైవిధ్యం' కనిపిస్తుంది. జంతువులభాషలో ఈ ద్వైవిధ్యం లేకపోవడాన్ని గుర్తించాలి. ఈ ద్వైవిధ్యతయొక్క ఆవిర్భావం ఎప్పుడయిందో, అప్పుడే మానవభాషకూడ ఆవిర్భూతమైందని చెప్పాలి.

ద్వైవిధ్యతకంటె ముఖ్యమైనది - అథవా - ఈ ద్వైవిధ్యాన్నికూడ తనలో ఇముడ్చుకోగల ఇంకో ముఖ్యలక్షణము మానవభాషలో కనిపిస్తుంది. క్షణక్షణానికీ క్రొత్తమాటలను సృష్టించుకోగలిగే, అలాగే సృష్టింపజాలని క్రొత్తమాటలను అర్థం చేసికోగలిగే శక్తిని - అది మానవుని కిచ్చింది. మనము ప్రతిదినము వాడేమాటలను, లేకుంటే వినేమాటలను, మునుపు ఎవరైనా వాడి ఉండవచ్చు. అయితే ఇందాక నేను వాడిఉండని, వినిఉండని పదాన్ని వాడగలను. ఆ మాటను ఇదివరకు వినిఉండని మీరూ అర్థం చేసికోగలరు. ప్రతిభాషలోనూ ఈ చిరనూత్నసృష్టి ఎలా జరుగుతోంది? సృష్టి అయిన ఆ మాట ఎలా అర్థమౌతోంది? ఈ సృష్టి-గ్రాహ్యాల వెనుకఉన్న వ్యవస్థ ఎలాంటిది? అన్నదాన్ని చూపెట్టేదే వర్ణనాత్మక వ్యాకరణకారుని మూలసమస్య. ఈ ఉప

న్యాసం చివరలోనూ, రాబోయే రెండు ఉపన్యాసాలలోనూ ఈ ప్రసక్తి చాలా పారిభాషికంగా ఉన్నందువల్ల ఈ సమన్వయనుగురించి కొన్నిమాటలు చెప్పాలి.

కాస్త విదానించిచూస్తే భాషలో కనిపిస్తుందన్న ఈ నిత్యనూతనసృష్టి నూతనమేమీ కాదేమొ. ఇక్కడ 'నూతన' మన్నదానికి, అందాక లేనిది అన్న అర్థం తప్ప, క్రొత్తవస్తువులనుండి తయారైనది అన్న అర్థం కాదు. ఉదాహరణకు: పాకశాస్త్ర ప్రపంచంనుండి ఒక పోలికను ఇవ్వవచ్చు. కొందరికి ప్రయోగాలుచేసి క్రొత్తక్రొత్త రీతిలో తినుబండారాలుచేసే చపలత్వముంటుంది. అలాటివారు వంటకుపయోగించే ముడి సరుకుల్లోకాని, వాటినికలిపే ఉచిత ప్రమాణాలలోకాని క్రొత్తేమీ ఉండదు. ఉప్పు, చక్కెర, రవ్వ, మిరపకాయ, నూనె, కొబ్బరిముక్క మొదలైన చిరపరిచిత సామగ్రులనే ఉపయోగించి, ఒక క్రొత్తరీతి ఖాద్యవస్తువును తయారుచేస్తారు. ఇక్కడ రెండు ముఖ్యవిషయాలున్నాయి. వాడేవస్తువులు పరిచితమైనవే అయినా, వాటిని కలిపే మోతాదుల్లో కొన్ని నియమాలను పాటించాలి. తయారుకావల్సిన పంటకం తియ్యగా ఉండాలంటే, మిరపకాయ వేయరాదు, వేసినా ఎక్కువ వేయరాదు. సిద్ధమవ్వాల్సిన వస్తువు కారంగా ఉండాలంటే, చక్కెర వెయ్యరాదు. వేసినా ఎక్కువ వేయరాదు. ఉప్పువేస్తే శౌరమైనదాన్నిగానే చూడాలి. ఇలా కొన్నినియమాలను పాటించాలి.

భాషావ్యవహారంలో ప్రతిఒక్కడూ నల సార్వభౌముడే. అత డుపయోగించేది, తా నెదిగినప్పటినుండి పలకడం నేర్చినధ్వనులే, శబ్దాలే. ఈ ధ్వనులనుకాని, ఈ శబ్దాలనుకాని జతపరచేటప్పుడు తనకు ఇష్టమైనటు జతపరచడం లేదు. కొన్ని నియమాలకు అనుగుణంగానే జతపరచాలి. ఈ ఒక్క వ్యవస్థవల్ల ఏభాష మాటాడేవాడైనా కాని, ఏమి కావాలన్నా చెప్పగలిగే వైయక్తికస్వాతంత్ర్య ముంటుంది. ఏశబ్దాలను కావాలనుకొన్నా అతడు తెలిసికోవచ్చు. ఈ వైయక్తికస్వాతంత్ర్యం మితిమీరి స్వచ్ఛందం కాకుండా, అతడు చెప్పేది ఇతరులకు అర్థంకాకుండాపోయే ప్రమాదం తప్పించేలాగ, కొన్ని నియమాలుంటాయి. సాధారణవ్యక్తిలో ఈ స్వాతంత్ర్య-బంధనాలు రెండూ హితమిత ప్రమాణాలో ఉండడంవల్ల అతనికి క్రొత్తక్రొత్త వాక్యాలను సృష్టించేది, అర్థం చేసికొనేది సాధ్యమౌతోంది. నియమాలబంధనం లేనప్పుడు శబ్దాలపట్టికమాత్రం ఇవ్వడమౌతుంది. శబ్దాలమీది అధికారం తప్పిపోతే, వ్రాతనియమా లున్నప్పటికీ ప్రయోజనం లేదు.

అందువల్ల వర్ణనాత్మక వ్యాకరణకారుడు తాను అభ్యసిస్తున్న భాషావ్యవస్థను కనుగొనాలంటే, ఆ భాషా విశ్లేషణానికి దిగాలి.

వర్ణణాత్మక వ్యాకరణకారుడు మొదట చేయాల్సిన పనేమిటంటే, తనకు ఎదురైన అసంఖ్యాకశబ్దాలను పట్టుకోడానికి వీలయ్యే మూలఘటికలుగా విడదీయాలి. మాటిమాటికి అగుపించే ఆంశికసామ్యాల ఆధారంమీద ఈ విశ్లేషణ జరగాలి. ఒకవిధంగా, ఈ విశ్లేషణకార్యం ప్రాథమిక బీజగణితంలో మనం సామాన్యంగా ఎదుర్కొనే విశ్లేషణలాగ సరళమైనట్టిపి ఉదాహరణకు:

$$Pq+Pr+Ps$$

అన్నదాన్ని

$$P\ (q+r+s)$$

అని వింగడపరుస్తాము; P అన్నది q, r, s ల జతలో రాగలదన్న సాధారణతత్వాన్ని బయట పెడుతున్నాము. 'Pq, Pr, Ps' అన్న రూపాలుగలవన్న ఈ సన్నివేశాన్ని వర్ణించినట్లయింది. అంటే ఈ సన్నివేశం వెనుక నిక్షిప్తమైన ఒక సామాన్యతత్వాన్ని కుదించినట్లయింది. ఇలాటి విశ్లేషణవల్ల ఆ సామాన్యతత్వము వెలుగులోకి వస్తునది. మన తత్వాలు ఎంతెంత సామాన్యమౌతూ పోతాయో, అంతంతగా సరళతను సాదించగలమన్నదాన్ని గమనించాలి. ఈ రూపాలను చూడండి:

| | | |
|---|---|---|
| *పెద్ద ఇల్లు* | *పెద్ద పక్క* | *పెద్ద చెట్టు* |
| *చిన్న ఇల్లు* | *చిన్న పక్క* | *చిన్న చెట్టు* |
| *మంచి ఇల్లు* | *మంచి పక్క* | *మంచి చెట్టు* |

ఈ తొమ్మిదిరూపాలనూ పట్టీవేసి ఇవి మనభాషలో కనిపిస్తాయి అంటే వీటిని 'వర్ణించి' నట్లే కావచ్చు. ఇలాటిపట్టీని ఇవ్వడం అన్నిసందర్భాల్లోనూ సాధ్యం కాకపోవచ్చు. కచ్చితమైన సంఖ్యలో రూపాలున్నప్పుడు, అదెంత పెద్దసంఖ్య అయినా కాని, ఇలాటిపట్టీలను ఇవ్వడం సాధ్యం కావచ్చు, అది శ్రమదాయకమైనా సరే. కాని క్షణక్షణానికీ క్రొత్తమాటలు సృష్టి అవుతున్న భాషయొక్క అనంతరూపాలను ఇలా పట్టీవేయడం సాధ్యమయ్యే విషయంకాదు; పైపెచ్చు ఈ సృష్టివెనుకఉన్న వ్యవస్థ ఎలాటిది అన్నప్రశ్నకు సమాధానమూ లభించదు. అనంతరూపాలను మితసంఖ్యలోకి కుదిస్తూ, ఆ మూల ఘటికలనుండి అనంతరూపాలను సిద్ధపరిచేదే సరైన శాస్త్రపద్ధతి. అందువల్ల మన తొమ్మిదిరూపాలను,

| | |
|---|---|
| *పెద్ద* | *ఇల్లు* |
| *చిన్న* | *పక్క* |
| *మంచి* | *చెట్టు* |
| 1 | 2 |

అన్న రెండువర్గాలుగా విడదీసి, మొదటివర్గంలోని ఒక రూపాన్ని, రెండవవర్గంలో ఉన్న ఒకరూపాన్ని తీసికొని, ఒక క్రమంలో జతపరిచితే వచ్చే రూపాలన్నీ మన భాషలో ఉన్నాయనడం మంచిది. ఇక్కడ స్వయంగా ఎన్నుకోవడానికి అవకాశం ఉండడంవల్ల వ్యక్తికి స్వాతంత్ర్యమూ, ఇలాంటిక్రమంలో రావాలన్న నియమంవల్ల బంధనమూ ఏర్పడడం గమనించవచ్చు.

వర్ణనాత్మక వ్యాకరణకారుడు మూలతః చేసేకార్యం ఇలాటిది. అతనిప్రకారం, ఏ భాషలోనైనా కాని ధ్వనులు కనిపిస్తాయి. అందువల్ల అతడు తాను వ్యాకరించే భాష యొక్క ధ్వనివ్యవస్థను వర్ణిస్తాడు. ధ్వనుల కూడికవలన సహస్రాధికంగా అర్థవంతాలు, అవిభాజ్యాలు అయిన శబ్దసముదాయం లభిస్తుంది. ఈ అవిభాజ్యమైన శబ్దాల అర్థాలకూ, వానిలోఉన్న ధ్వనులకూకల సంబంధం యాదృచ్ఛికమైనందువల్ల, అంటే ఎలాటి నియమానికి లోబడకపోవడంవల్ల అలాటి శబ్దాలనన్నిటినీ పట్టీ వేయాల్సివస్తుంది. అలాటి శబ్దాలపట్టికయే నిఘంటువౌతోంది. ఇక్కడ 'నిఘంటు' వన్నశబ్దం ఒక పరిమిత పారిభాషికార్థంలోమాత్రమే ప్రయుజ్యమైంది. సాధారణంగా ప్రకటితమయ్యే నిఘంటు వుల్లో అవిభాజ్యంకాని శబ్దాలూ పేరుకొనిఉంటాయి, వ్యవహారానుకూలమైన దృష్టితో చెప్పాలంటే ఈ పద్ధతి మెచ్చతగ్గదే. అయితే వర్ణనాత్మక వ్యాకరణదృష్టినుండి చెప్పా లంటే అవిభాజ్యమూ, అర్థవంతమూ అయిన శబ్దాల మూలభాండారమే అతని విశ్లేష ణకు అంతిమఫలం. ఇదే తాను వ్యాకరిస్తున్న భాషయొక్క నిఘంటువు. ఈ అంతిమ ఫలమే వ్యాకరణంయొక్క ఇతరభాగాలకూ మూలసామగ్రి.

ఏ భాషావ్యవస్థనైనాకాని, రెండుభాగాలుగా విడదీయవచ్చు. నిఘంటువునుకూడా కలిపితే మూడుభాగా లౌతాయి. ఒకటి-ధ్వనివ్యవస్థ. రెండవది-వ్యాకరణం. వ్యాకరణ మన్నదాన్ని పదసిద్ధి, వాక్యసిద్ధి అన్న రెండుభాగాలుగా విడదీయవచ్చు. అవిభాజ్యాలూ, అర్థవంతాలూ అయిన మూలఘటికలనుండి పదాలు ఎలా సిద్ధమౌతాయన్నదాన్ని పద సిద్ధి వర్ణిస్తే, ఇలా తయారైన పదాలనుండి వాక్యాలు ఎలా సిద్ధమౌతాయన్నదాన్ని వాక్యసిద్ధి వర్ణిస్తుంది.

వ్యాకరణమన్నదాన్ని ఇలా విభజించేదానిపై కొన్నిమాటలు చెప్పాలి. ప్రతి భాషయొక్క వ్యాకరణాన్ని ఇలాటి విభజనకు లోబరచడం సాధ్యం కాకపోవచ్చు. ఇక్కడ రెండు వైపరీత్యాలను గమనిద్దాము. ఈ వైపరీత్యాలకు నిదర్శనం కాగలిగే భాషలు నిజంగా కనిపించకపోవచ్చు. అయితే, ఈ వైపరీత్యాలను సమీపించేభాషలు

లేకపోలేదు. ఒకభాషలో నిఘంటువు క్రోడీకరించిన అవిభాజ్యకశబ్దాలే పదాలుగా ప్రయోగింపబడుతుండవచ్చు. ప్రత్యయాలన్నవే లేకపోవచ్చు. ఇలాటిభాషలో పదసిద్ధిని ఎలా వర్ణించేది? కేవలం వాక్యసిద్ధియే వ్యాకరణకార్య మౌతుంది. చీనాభాషలో పదాలక్రమము చేసేపనినే, ఇంకొకభాష పదాలలో కనిపించే ప్రత్యయాలవల్ల నిర్వహిస్తుండవచ్చు. ఇది నిజంగా వైపరీత్యాన్ని చేరితే పదాలను ఏపద్ధతిలోచేర్చినా సాధువైనవాక్యం లభిస్తుంది. ఇలాటిభాషలో వాక్యసిద్ధిని ఎలా వర్ణించేది? సంస్కృతం ఈ విపరీతానికి సమీపంలో ఉన్న భాష అంటారు.

అంచేత పదసిద్ధి - వాక్యసిద్ధి అన్న విభాగాలే కొన్నిభాషలకు అంతగా అన్వయించకపోవచ్చు. అయితే అదృష్టవశాత్తు ప్రపంచంలోఉన్న చాలాభాషలు ఈ విపరీతాలకు పోకపోవడంవల్ల, వ్యాకరణాన్ని ఇలా విభజించేది శాస్త్రీయదృష్టినుండి సందేహాస్పదమౌతున్నా, వర్ణనానుకూలదృష్టినుండి ఉపయోగకరమౌతోంది.

మన వ్యాకరణాన్ని ఇలాగ పదసిద్ధి - వాక్యసిద్ధి అంటూ విభజించడం ఉపయోగకరమని భావిద్దాము. అయితే సమస్య ఇంతటితో అంతంకాదు. ఎక్కడ పదసిద్ధి ముగిసి, వాక్యసిద్ధి మొదలవుతుందో చెప్పడం కష్టమౌతుంది. అంటే పదసిద్ధి - వాక్యసిద్ధుల సీమాప్రదేశము కచ్చితమైనది కాదు. పదసిద్ధి విభాగానికే నిస్సందేహంగా చేరే భాగాలు లేవనడం లేదు. '*చేసితిని, పిల్లలు, మంచి*' మొదలైనరూపాలు పదసిద్ధి భాగానికి చేరినవే... అలాగే '*మంచి పిల్లవాడు, అతడు మైసూరినుంచి నిన్న వచ్చాడు, చేసిన పని*' మొదలైనవి వాక్యసిద్ధి విభాగానికి నిస్సందేహంగా చేరేవే. ఇప్పుడు *మంచి పిల్లలకు* అన్నరూపం చూడండి. *మంచి పిల్లలు* అన్నదాన్ని మొదట చూద్దాము. *పిల్లలు* అన్నదానికి *మంచి* అన్నది విశేషణమని చెప్పవచ్చు. దీన్ని విశేషణం+విశేష్యం అన్న రచనతోటి పదసముదాయమని చెప్పవచ్చు. *మంచి పిల్లలకు* అన్నప్పుడు చతుర్థీప్రత్యయం చేరినది దేనికి? *పిల్లలు* అన్నదానికి అంటే, *పిల్లలకు* అన్నదాన్ని విశేష్యం అనీ, *మంచి* అన్నదాన్ని విశేషణం అనీ పిలవడంలేదు. అలాగ అంటే వింతగా ఉంటుంది. *పిల్లలు* అన్నదానికి *మంచి* అన్నది విశేషణమనడంలో విచిత్రం లేదు. అందువల్ల చతుర్థీ ప్రత్యయం *మంచి పిల్లలు* అన్నదానికి చేరినదంటే పెనమునుంచి పొయ్యిలోకి పడ్డట్లవుతుంది. ఎందుకంటే పదసిద్ధివిభాగంలో పదాలే మూలఘటిక అన్నమాటను గుర్తుంచుకొంటే (అ)కు అన్నది పదమని భావించాలి. *నిన్న తుముకూరినుండి వచ్చిన ఈ మనిషికి* అన్నదాంట్లోనూ అలాటి కష్టమే.

అందువల్ల పదసిద్ధి - వాక్యసిద్ధి అన్నవిభాగాలు ఉపయుక్తమని ఒప్పుకొన్నా,

ఈ విభజన అన్నిభాషలకు అన్వయించడం లేదు. అన్వయించడానికి సాధ్యమైన భాషల్లోనూ ఆ రెంటిపరిధి నిక్కచ్చిగా లేదన్న హద్దును మనం జ్ఞాపకముంచుకోవాలి.

అసలైన చర్చనుండి మిమ్మల్ని దారి తప్పించాను. దయతో మన్నించాలి. మళ్ళీ మొదటికివచ్చి చెప్పాలంటే, వర్ణనాత్మక వ్యాకరణంలో ధ్వనివ్యవస్థ, పదసిద్ధి, వాక్యసిద్ధి అన్న మూడువిభాగాలు, చివరలో ఒక నిఘంటువు ఉంటుంది. ఈ క్రమాన్ని చూపి వ్యాకర్త ఇదేక్రమంలో విశ్లేషణ సాగిస్తుంటాడని భావించరాదు. విశ్లేషణ కాలంలో అతడు ఏ క్రమాన్నయినా అనుసరించవచ్చు. అయితే ఆ విశ్లేషణయొక్క ఫలితాంశాలను విద్వజ్జనుల అవగాహనకు పెడుతున్నప్పుడు పైన చెప్పినక్రమాన్ని పాటించటమే పరిపాటి.

ఇందాక చెప్పిన మాటలవల్ల స్పష్టమైనప్పటికీ, 'వర్ణనాత్మక వ్యాకరణకారుడు వర్ణించేది దేన్ని?' అన్నప్రశ్నకు సమాధానమిచ్చాము. ఆయన వర్ణించేది ఏదైనా ఒక భాషయొక్క అసంఖ్యాకరూపాలను కాదు. ఆ అసంఖ్యాకరూపాలవెనుక నిక్షిప్తమైన వ్యవస్థను అన్నది మరువరాదు. వ్యవస్థ అంటే ఏమిటి?... కొన్ని మూలఘటకలు, వాటికున్న పరస్పర సంబంధాలు 'వ్యవస్థ' అనిపించుకొంటాయి. అంచేత ఏ భాషా వ్యవస్థనైనా కాని. సరిగ్గా వర్ణించడం జరిగితే, ఈ వర్ణనాసహాయంనుండి ఆ భాష యొక్క సాధురూపాలన్నీ సిద్ధం కావాలి. ఒక్క అసాధు రూపంకూడ సిద్ధం కారాదు. సాధురూపమంటే ఏమిటి? అసాధు రూపమంటే ఏమిటి? అన్న చర్చలో కాలు పెట్టకుండా చెప్పాలంటే ఇప్పటిస్థితిలో ఇలాటి వ్యాకరణరచన జరగడం కష్టమే. అందుకోసమే వర్ణనాత్మక వ్యాకరణకారుడు కొన్ని పరిమితులను తనకు తానే విధించుకొంటాడు.

కన్నడ వ్యాకరణాన్ని వర్ణనాత్మకంగా వ్రాయదలచేవ్యక్తి తనకు తాను వేసికోవాల్సిన ప్రశ్న ఏమిటంటే - ఏ కన్నడానికి? అన్నదే. గ్రంథస్థమైన కన్నడమా? వ్యావహారిక కన్నడమా?....గ్రాంథికమంటే మళ్ళీ హళగన్నడ, నడుగన్నడ, హొసగన్నడాలలో దేనికి? హొస (క్రొత్త) కన్నడం అంటే పద్యభాషనా? గద్యభాషనా? ....పద్యభాష అంటే నవ్య (భావ) కవితల భాషనా? నవ్యేతర కవుల భాషనా? గద్యభాష అంటే నవలల భాషనా? పత్రికల భాషనా? శాస్త్రగ్రంథాల భాషనా?....గ్రాంథిక మక్కర లేదు, వ్యావహారికమంటే మైసూరుదా? మంగళూరుదా? ధార్వడదా? బెళగామ్ దా? ఈ ఒక్కొక్క ప్రదేశంలోనూ ఏ జాతివాళ్ళ భాష? బ్రాహ్మణులదా? వీరశైవ

లదా? హరిజనులదా? ఈ విభేదాలన్నిటిలోనూ ఒకదానికీ, ఇంకొకదానికీ సాదృశ్యం ఉండడం నిజమైనా, ఈ సాదృశ్యమే లేకుంటే వీటినన్నిటినీ కన్నడం అన్న ఒక పేరుతో పిలవడం లేదన్నదీ నిజమైనా, అన్నిటినీ వర్ణిస్తానని సిద్ధపడడం మూర్ఖత్వమౌతుంది. ఏదైనా ఒక కాలంలో ఒక ప్రదేశంలో ప్రచారమైన కన్నడాన్ని అతడు స్వీకరిస్తాడు. ఈ చిన్ని ప్రదేశంలో ఐదువేలమంది జనులుంటే, ఆ ఐదువేలమంది మాటలనూ అభ్యసించడానికి వీలవడంలేదు. భాషాదృష్టినుండి ఆ స్థలానికి చక్కటి ప్రతినిధులనతగ్గ ఇద్దరు ముగ్గురు వ్యక్తులనుండి శబ్దరూపాలను గ్రహిస్తాడు. అప్పుడప్పుడు ఇతరుల మాటలమీదకూడ చెవిపెడుతూ, తాను తీసికొన్న ప్రతినిధుల వాడుకకూ, ఇతరుల వాడుకకూ విశేషవ్యత్యాసాలు లేవని నిశ్చయం చేసికొంటాడు. ఇలాగ ఆ ప్రదేశపుభాషమీద చాలినంతకాలం పనిచేసి తన వ్యాకరణాన్ని సిద్ధపరుస్తాడు. ఇంతయితే అతని వ్యాకరణం సాధురూపాలన్నిటినీ సిద్ధపరచడంలో విజయం పొందవచ్చు. కాకుంటే కొన్ని అసాధురూపాలను సిద్ధపరచనూ వచ్చు. అయితే అతడు వ్రాసిన వ్యాకరణమే మనకు ప్రమాణం. ఇదే ప్రదేశపుభాషమీద ఇంకొక వ్యాకరణం తయారై, మొదటి వ్యాకరణంకంటె ఎక్కువ సాధురూపాలనూ, తక్కువ అసాధురూపాలను సిద్ధపరిచితే, అప్పుడు మనకు ఈ రెండవవ్యాకరణం ప్రమాణమౌతుంది.

వర్ణనాత్మక వ్యాకరణకారుడు తనకు తాను విధించుకొనే పరిమితులమీద మాటాడ్డం వదలి, ఒక భాషమీద సిద్ధమయ్యే వ్యాకరణం ఉపాదేయమో, కాదో అన్నదాన్ని నిర్ధరించడానికి వచ్చి చేరాను. ఈ ప్రశ్నకు సాపేక్షకమైన సమాధానాలను ఇవ్వవచ్చు. అంతే. ఇందాకే చూసినట్లు ఒకభాషమీద సిద్ధమైన రెండు వ్యాకరణాలో ఎక్కువ సంఖ్యలో సాధురూపాలను, తక్కువసంఖ్యలో అసాధురూపాలను సిద్ధపరిచే వ్యాకరణం మిక్కిలి ఉపాదేయమౌతుంది.

ఒక భాషమీద వ్రాయబడ్డ రెండు వ్యాకరణా లున్నాయనుకొందాం. ఇవి రెండూ సాధురూపాలను సిద్ధపరచడంలోనూ, అసాధురూపాలను దూరంగా ఉంచడంలోనూ సమానంగానే ఉన్నాయనుకొందాము. (ఇలాటి సమానబలంగల వ్యాకరణాలు భాషావేత్తలచర్చల్లోమాత్రం అగుపించేవన్న విషయాన్నికూడ మరువకుండా ఉందాము!) ఇప్పుడు, ఈ రెంటిలో ఏది ఎక్కువ ఉపాదేయము?... ఏదైతే ఎక్కువ సరళమో, అది ఎక్కువ ఉపాదేయము. ఒక ఉదాహరణతో ఈ మాటను స్పష్టపరుపవచ్చు. తక్కిన అన్నివిషయాల్లోనూ సమానమైన రెండు కన్నడవ్యాకరణాలు ఉన్నాయనుకొందాము. ఒకదాంట్లో భూతకాలికరూపాలను సిద్ధపరుస్తున్నప్పుడు, *కాడు*, *బిడు*, *ఉడు*

మొదలైన ధాతువులను *నగు, మిగు, సిగు* మొదలైన ధాతువులను క్రోడీకరించి వీటికి భూతకాలంలో *కొట్ట్ - బిట్ట్, ఉట్ట్* అని, *నక్క్, మిక్క్, సిక్క్* అని రూపాలేర్పడతాయని వర్ణితమైందనుకొందాము.* ఇంకొకటి ఈ పట్టీ ఇవ్వకుండా, ఈ రూపాలవెనుకఉన్న నియమాన్ని చూపెట్టి సూత్రప్రాయంగా పేర్కొందనుకొందాము. (ఈ నియమం ఏమిటన్నదాన్ని రాబోయే ఉపన్యాసంలో గమనిద్దాము) అప్పుడు ఈ రెండవవ్యాకరణమే ఎక్కువ సరళమూ, ఉపాదేయమూ అవుతోందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అసాధురూపాలను సిద్ధపరచనిగుణాన్ని సమర్పకత అనీ, సాధురూపాల నన్నిటినీ సిద్ధపరిచేగుణాన్ని సమగ్రత అనీ, రూపాలవెనుకఉన్న నియమాలను ప్రదర్శించడంవల్ల లభించేగుణాన్ని సరళత అనీ చెప్పవచ్చు. ఈ మూడుగుణాలూ కేవలం కొలతబద్ద కొలతకు నిలిచేవికావు. సాపేక్షకమైనవని ఒత్తి పలుకుతున్నాను. సమగ్రత, సమర్పకతలు సమానబలం గలవి. అంటే ఈ రెంటిలో ఒకటి ఎక్కువ బలశాలి అన్నది లేదు. రెండు వ్యాకరణాలనుపోల్చి ఒకటి ఇంకోదానికంటె ఎక్కువ సమర్పకమని, లేదా తక్కువ సమర్పకమని చెప్పవచ్చు. ఒకటి ఎక్కువ సమగ్రమని, ఇంకొకటి తక్కువ సమగ్రమనికాని చెప్పవచ్చు. సమాన సమర్పకతగల రెండు వ్యాకరణాలుంటే, ఏది ఎక్కువ సమగ్రమో అది ఉపాదేయమౌతుంది. అలాగే సమాన సమగ్రతగల రెండు వ్యాకరణాలున్నప్పుడు సమర్పకతనుబట్టి ఉపాదేయమౌతాయి. అందువల్లే సమర్పకత, సమగ్రత అన్నవి రెండూ సమానబలంగల గుణాలు అన్నాను. సరళతవిషయం అలా కాదు. దానిబలం పై రెంటికంటెకూడ తక్కువది. రెండు వ్యాకరణాల్లో ఏది ఎక్కువ సరళమన్నప్రశ్న జనించేది, ఆ రెండూ సమర్పకత, సమగ్రతలవిషయంలో సమానంగాఉన్నప్పుడే. అసమగ్రవ్యాకరణం సమగ్రవ్యాకరణంకంటె కూడ సరళంగా ఉంటుంది ; అంచేతే సరళతకు విలువ ఏర్పడేది, మిగిలినవిషయాల్లో సమానంగాఉన్న వ్యాకరణాలను పోల్చినప్పుడే.

సమర్పకత - సమగ్రత - సరళత అన్న ఈ మూడుగుణాల జతకు ఉత్తమ వ. వ్యా. లో ఇంకా కొన్ని గుణాలుండాలి. ఒకదృష్టితోచూస్తే, ఈ మూటివల్లనే మిగిలినవి నిష్పన్నమౌతున్నప్పటికీ వాటిని క్రోడీకరించటం మంచిది. నిక్కచ్చితనం, శాస్త్రీయ నిర్వికారం, పూర్వాపరసాంగత్యం, మాత్రాలాఘవం, ప్రయోగశరణత్వం -

* ఇలాటి రూపపరిణామం తెలుగులోలేదు కనుక, ఉదాహరణకోసం *వ్రాయు, కోయు, చేయు* వంటి ధాతువులు వ్యవహారపరిణామాన్ని గమనించవచ్చు.

అన్నవే ఆ గుణాలు. ప్రయోగశరణత్వమన్న విషయానికి సంబంధించి నాలుగుమాటలను చెప్పాలి.

'The informant is always Correct' అన్నమాట ఉంది. కొన్నిరూపాలు మనకు ఇబ్బందిని ఇవ్వవచ్చు. మనము చేద్దామనుకొన్న సామాన్యనియమాలకు అపవాదంగా ఉండవచ్చు. అలాటిరూపాలను విడిచిపెట్టకుండా, వాటినన్నిటినీ క్రోడీకరించాలి. 'All grammars leak' అన్న సపీర్ సూక్తిని మరువరాదు. కాకుంటే ప్రయోగాల సాధుత్వా సాధుత్వాలను నిర్ధరించడం. వెలితి చేయకూడదు. రెండు వైకల్పికరూపాలంటే, ఒకటి ఎక్కువ ఉపాదేయమన్న విధాయకమనోవృత్తిని వర్జించాలి. రెండు వైకల్పికరూపాలలో ఒక రూపంపట్ల. ఆ భాష మాట్లాడేవారికి పక్షపాతం ఉన్నప్పుడు, ఆ పక్షపాతాన్నే తన నిర్ధారణగా భావించరాదు. ఉదాహరణకు ఒడియా భాషలో, క్రియాపదాలలో ప్రథమపురుష బహువచనప్రత్యయం మెయ్ అయినా కావచ్చు. ది అయినా కావచ్చు. వాళ్ళయితే ఆ రూపాలను ఇచ్చేటపుడు మెయ్ అంటూ వాడుతారు. ది అన్నదాన్ని ఉపయోగించి మన మొకరూపాన్ని తయారుచేస్తే దాన్ని తప్పనడం లేదు. అందువల్ల వస్తుస్థితి ఎలాగున్నదన్నదాన్నే వర్ణించాలి.

ఇంతవరకు భాషాలక్షణాలలో కొన్నిటిని, వర్ణనాత్మకవ్యాకరణం అంటే ఏమిటన్నదాన్ని ఒకభాషపై వ్రాయబడ్డ రెండు వర్ణనాత్మక వ్యాకరణాల మౌల్యనిర్ధారణ ఎలాగన్నదాన్నిగురించి కొన్నిమాటల్ని చెప్పాను. ఇక వర్ణనాత్మక వ్యాకరణకారుడు భాషావిశ్లేషణలో ఉపయోగించే కొన్ని మూలభూత కల్పనలనుగురించి మాట్లాడుతాను.

మొదట 'పరిసరం' అంటే ఏమిటో అర్థం చేసికొందాము. ఏదైనా ఒక అంశం వెనుక - లేక - ముందుఉన్న ఇతరఘటికలను దాని 'పరిసరము' అని పిలువవచ్చు. మర అన్నదాంట్లో ఉన్న రేఫముయొక్క పరిసరాన్ని రకరకాలుగా వర్ణించవచ్చు. ఈ శబ్దంలో రేఫము అకారము ఉచ్చరితమైనతర్వాత వస్తుందనవచ్చు. అకారమునకు ముందు వస్తుందనవచ్చు. రెండు అకారాలనడుమ వస్తుందనీ చెప్పవచ్చు. మ అన్న దానికి అనంతరం వస్తుందనవచ్చు. మ అన్నదానికి అ అన్నదానికి నడుమ వస్తుందనవచ్చు. ఈ అన్నివిధాలవర్ణనలూ, అన్నివేళల్లోనూ ఉపయోగపడుతాయని కాదు. ప్రకృత ఉద్దేశ్యానికి ఏది ఉపయోగమో దాన్ని గ్రహించవచ్చు.

పరిసరంగురించి ఇంతవరకు చెప్పినమాటల్నిబట్టి మూడురకాల పరిసరాలను గుర్తించవచ్చు. పూర్వపరిసరం, పరపరిసరం, ఉభయపరిసరం అన్నవే ఆ మూడు

విధాలు. ఈ మూడింటిలో ఉభయపరిసరమన్నదాన్ని పూర్వ - పర పరిసరాల సంకల నంగాకూడ పరిగణించవచ్చు. మర అన్నదాంటో అ- మరియు, మ- అన్నవే రేఫము యొక్క పూర్వపరిసరాలు. అ అన్నదే రేఫముయొక్క పర పరిసరము. మ-అః అ-అ అన్నవి రేఫముయొక్క ఉభయపరిసరాలు.

పరిసరానికి సంబంధించి ఇంకొక అంశాన్ని తెలిసికోవాలి. మర అన్నదాంట్లో మ కారానికి పూర్వపరిసరమున్నదా ?....ఉన్నది. దాన్ని మౌనము - లేక - విరామం అని పిలువవచ్చు. ఈ విరామాన్ని # అన్నచిహ్నంతో చూపడం ఉన్నది. అందువల్ల మకారంయొక్క పూర్వపరిసరం # - అవుతుంది. అలాగే ఒక మాటలోని చివరి అంశంయొక్క పర పరిసరం అని # వల్ల చూపవచ్చు. ఇక్కడ మర అన్నదాని చివరి అంశంయొక్క పర పరిసరాన్ని - # అని చూపవచ్చు.

ఇదేమాట ఇతరవిధాల అంశాలకు అన్వయిస్తుంది. బరెదను అన్నదానిలో ఉన్న అను అన్న ప్రత్యయంయొక్క పరిసరం ద్ అన్న భూతకాలప్రత్యయం.* ఇలాగే ఏదైనా ఒకశబ్దాన్ని తీసికొని దానిలో ప్రకృతమైన ఘటికనుగ్రహించి దాని పరిసరాన్ని తెలపడంకంటె, ఒక భాషలో కనిపించే అన్ని శబ్దరూపాలకు అన్వయించేలాగ సామా న్యమైన పరిసరాలను గమనించడం ఎక్కువ ఉపయోగకరం. ఈ దృష్టినుండి చూస్తు న్నపుడు కన్నడంలో రేఫం ఏ ఏ పరిసరాల్లో వస్తుందన్నదాన్ని గమనించడం ఉపయోగ కరం. కన్నడంలో రేఫము శబ్దాదిలోనూ, శబ్ద మధ్యంలోనూ వస్తుందనడం ఇలాటి మాట. ఇంకా ఎక్కువ వివరణ కావాలంటే రేఫం పరిసరాలను #· , # - స్వరము, స్వ-స్వ. స్వ-వ్యంజనం, వ్యం-స్వ అని చూపవచ్చు. ఇంకా ఎక్కువ వివరంగా కావా లంటే ఈ ఒక్కొక్కపరిసరాన్ని తీసికొని స్వరము, వ్యంజనము అని వ్రాసినచోట్లలో సాక్షాత్తుగా కనిపించే స్వరాలపట్టికనూ, వ్యంజనాలపట్టికనూ ఇవ్వవచ్చు. కన్నడంలో అరువు పదాలను పరిగణనకు తీసికొంటే, రేఫము కనిపించే పరిసరాలు పైన చెప్పిన అయిదే. కన్నడంలోని హల్లులు చాలాభాగం ఈ అయిదు పరిసరాల్లోనే కనిపించడం గమనించవచ్చు.

ఏదైనా ఒక అంశంయొక్క పరిసరాలమొత్తం సమూహాన్ని ఆ అంశంయొక్క 'ప్రసార'మని పిలుస్తారు. కన్నడంలో ఐకారంయొక్క పరిసరం ఏమిటని అడిగితే, స్వ-స్వ. స్వ-వ్యం, వ్యం-స్వ అన్నదే సమాధానం. బహువచనప్రత్యయపు ప్రసా

* వ్రాశాడు అన్న తెలుగుమాటలో డు అన్న ప్రత్యయంయొక్క పరిసరం ఆ అన్న భూతకాలప్రత్యయం.

మేమిటని అడిగితే, ప్రాతిపదిక—అనడం సమాధానం. ధాతువుల ప్రసార మేమిటన్న ప్రశ్నకు # —అన్నదీ, ధాతువు తరువాతవచ్చే ప్రత్యయాలపట్టికా సమాధానం.

ఈ ప్రసారవిషయానికి సంబంధించే ఒక చక్కవివ్యానం వ్రాయవచ్చు. అంతటి వ్యాసోద్ఘాటనకు దిగకుండానే, దానికి సంబంధించిన మూడు ముఖ్యవిషయాలను తెలిసికొందాము.

ఇందాక మనం చూసింది, ఏదైనా 'ఒక అంశం' యొక్క ప్రసారాన్ని. రెండు లేక అంతకంటె ఎక్కువ సంఖ్యలోఉన్న ప్రసారాన్ని గమనిస్తేంటే ఆ పోలికనుండి కొన్ని స్వారస్యమైన సంగతులు తెలుస్తాయి. వివక్షలో ఉన్న ఘటికలు ఒక పరిసరంలో కనిపించవచ్చు. కనిపించకపోవచ్చు. ఉదాహరణకు కన్నడంలోని హల్లులలో చాలాభాగం స్వ-స్వ అనెడి పరిసరంలో కనిపిస్తాయి. ధాతువులన్నీ భూతకాలప్రత్యయం యొక్క పూర్వపరిసరంలో వస్తాయి. దీనికి వ్యతిరేకంగా వివక్షతలో ఉన్న అంశాలు ఒకే పరిసరంలో కనిపించకపోవచ్చు. ఉదాహరణకు కన్నడంలో దంత్య నకారం, వర్త్స్య నకారంం, తాలవ్య ఞకారం, మృదు తాలవ్య ఙకారం, ఒకేపరిసరంలో కనిపించడం లేదు. తకార, దకారాల పూర్వంలో దంత్యనకారమూ (నంతె, మందె). చకార జకారాల పూర్వంలో ఞకారము (పంచె, నంజె). కకార గకారాల పూర్వంలో ఙకారమూ (సుంక, తంగి).* ఇతర పరిసరాల్లో వర్త్స్య నకారమూ (నాను, మనె) వస్తుంది. ఈ విషయాన్నే ఈ క్రింది కోష్ఠకరూపంలో ప్రదర్శించవచ్చు.

| | —త్/ద్ | —చ్/జ్ | —క్/గ్ | ఇతరత్ర |
|---|---|---|---|---|
| దంత్య నకారం | × | — | — | — |
| తాలవ్య ఞకారం | — | × | — | — |
| కంఠ్య ఙకారం | — | — | × | — |
| వర్త్స్య నకారం | — | — | — | × |

కనుక ఈ నాలుగు అనునాసికలూ పరస్పరవ్యావర్తక పరిసరంలో వస్తున్నాయని పరిగణించవచ్చు.

ఈ నిరూపణవల్ల ఒక అంశం స్పష్టమౌతుంది. ఒకే పరిసరంలోవచ్చే అంశాలను ఊహించడానికి సాధ్యం కాదు. '-ఉరి' అన్నపరిసరంలో కకారం వస్తుందా, గకారం

---

* వాఙ్మయ, తన్మయ, మృణ్మయ అన్నపదాల్ని పరిగణనకు తీసికొంటే ఈమాట వాస్తవంకాదని చెప్పవచ్చు.—రచయిత.

వస్తుందా, తకారం వస్తుందా, నకారం వస్తుందా, పకారం వస్తుందా, మకారం వస్తుందా అని అడిగితే అన్నీ వస్తాయనే చెప్పాలి. ఏదైనా ఒక సన్నివేశంలో అనేక పర్యాయాలుండగా, ఈ పర్యాయాలలో ఏది సంభావనీయమని అడిగితే, సమాధానం ఇవ్వ డానికి సాధ్యంకాని పరిస్థితి ఇది. దీనికి వ్యతిరేకంగా, వ-వె అన్నపరిసరంలో దంత్య నకారం వస్తుందా? వర్త్స్య నకారం వస్తుందా? తాలవ్య నకారం వస్తుందా? కంఠ్య ఙకారం వస్తుందా? అని అడిగితే, తాలవ్యమే వస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఏదైనా ఒక సన్నివేశంలో అనేకపర్యాయాలుంటే, ఈ పర్యాయాలలో ఇక్కడ ఏది సంభవనీయమని అడిగితే నిస్సందేహంగా సమాధానాన్ని ఇవ్వగలిగేపరిస్థితి ఇది. ఇలాగ పరస్పర వ్యావర్తకపరిసరాలలో వచ్చే అంశాలు 'పూరక ప్రసారం'లో ఉన్నా యని లెక్కిస్తారు.

పూరక ప్రసారమన్న మాటలోని ఔచిత్యాన్ని ఒక ఉదాహరణతో స్పష్టపరుప వచ్చు. కన్నడ లో కకారంయొక్క ప్రసారాన్ని, స్పర్శ డకార, తాడిత డకారాల ప్రసా రాన్ని ఇలాగ చూపవచ్చు.

| | # — | స్వ-స్వ | యమళత | సమానస్థానీయమైన అనునాసిక- |
|---|---|---|---|---|
| కకారం | × | × | × | × |
| స్పర్శ డకారం | × | — | × | × |
| తాడిత డకారం | — | × | — | — |

రెండువిధాల డకారాల ప్రసారాలను కలిపితే, కకారంయొక్క ప్రసారం లభి స్తుంది. లేక రెండురకాల డకారాలూ కకారంయొక్క ప్రసారాన్ని పంచుకొంటున్నవి. కకారమొకటే నాలుగుపరిసరాల్లో చేసేకార్యాన్ని ఈ రెండు డకారాలు కలిపి పూర్తి చేస్తున్నవి.

కొన్నిఅంశాలు పూరకప్రసారంలో ఉన్నాయని ఎందుకు చెప్పాలి? ఇలాటి అధ్యయనంవల్ల ప్రయోజనమేమిటి? అన్నప్రశ్న జనిస్తుంది. ధ్వనులకార్యం శబ్దాలను వేరువేరుగా ఉంచేదన్నమాటను గుర్తుకు తెచ్చుకొంటే, పూరక ప్రసారంలోని అంశా లలో ఉండతగ్గ వ్యత్యాసాలకు విలువలేదు అన్నదే స్థూలమైన సమాధానం. ఒకే పరి సరంలో రాని రెండు అంశాలకు విలువ లభించేది ఎలాగ? ఉదాహరణకు, కన్నడం లోని కకారానికి, గకారానికి గల తేడాకు విలువ ఉందని ఎలా చెప్పగలం? కకార స్థానంలో గకారం ఉంచితే భిన్నార్థంకల శబ్దమో, లేక అర్థమేలేని ధ్వని సముదాయమో

వస్తుంది. *ఖరి* అన్నదాన్ని *గరి* అంటే వేరే అర్థంకల శబ్దము వస్తుంది.* *కేళ* అన్న దాన్ని *గేళ* అంటే అర్థమే కాదు. అందువల్ల రెండు ఘటికలకు మధ్యగల వ్యత్యాసానికి విలువ ఉందా? లేదా? అని తెలిసికోవడానికి, వాటిని ఒకదానిస్థానంలో ఇంకొకటి ఉంచి చూడడమే మార్గం. పూరకప్రసారంలోఉన్న అంశాలను ఇలాగ ఒకదాని స్థానంలో ఇంకొకదాన్ని ఉంచడం, స్వాభావికమైన ఉచ్చారణలో సాధ్యమేకాదు. వాటి వ్యత్యాసాలకు విలువేలేదు అని విశదమౌతుంది. అంచేత పూరకప్రసారమన్న కల్పన శుష్కమైనది కాదు. ఉపయుక్తమైందనికూడ అర్థమౌతుంది.

పూరకప్రసారంయొక్క ఉపయుక్తతగురించి మాటాడుతున్నప్పుడు, ఒక విషయం స్పష్టపరచాలి. ధ్వనులవిపక్ష ఉండగా, ఈ కల్పన ఇచ్చే ఆశ్రయం విశ్వసనీయమైందే. అయితే తద్భిన్నసందర్భాలలో కొన్నిచోట్ల దీని ఉపయోగాన్నిగూర్చి జాగ్రత్తగా ఉండాలి. ఉదాహరణకు *గళ*, *అలి* అన్న రెండు ప్రత్యయాలు పూరక ప్రసారంలో ఉన్నాయి. *గళ* అన్నది ప్రాతిపదికలకు పరంగానూ, *అలి* అన్నది ధాతువులకు పరంగానూ వస్తాయి అవి రెండూ ఒకే పరిసరంలో రావడమే లేదు. ఇప్పుడు ఈ రెంటికీ ఉన్నతేడాకు విలువలేదని చెప్పవచ్చునా? ఈ ఆక్షేపణను ఎలా నివారించేది? దీనికి మార్గమొకటే. పూరకప్రసారమన్న కల్పనను ఇలాటి సందర్భాల్లో వాడుకోవడం. విపక్షలోఉన్న అంశాలకు అర్థముంటే, అవి పూరకప్రసారంలో ఉన్నవా? లేవా అన్నవిషయాన్ని తెలిసికోవడానికి మునుపు, అవి ఒకేజాతికి చేరిన పదాలలో వస్తున్నవా? లేదా? అన్నదానిని గమనించాలి. అవి వేరు వేరు జాతిపదాలలో వస్తూంటే, పూరకప్రసార కల్పనను వాడ నక్కరలేదని ప్రస్తుతానికి చెప్పవచ్చు. *గళ*, *అలి* అన్నవి వేరు వేరు జాతిపదాలలో వస్తాయి. ఆ రెంటికీ వేరే అర్థమున్నది. అంచేత ఆ రెండూ పూరకప్రసారంలో ఉన్నాయా? అన్నప్రశ్నే రాదు. *గళ*, *అరు*, *అందిరు* అన్నవి ఒకేజాతిపదాలలో వస్తాయి. అవి పూరకప్రసారంలో ఉన్నాయని చెప్ప వచ్చు. అందువల్ల వాటికిగల తేడాకు విలువలేదని చెప్పవచ్చు.

పూరకప్రసారంలోగల అంశాలకు ఉండతగ్గ వ్యత్యాసాలకు విలువలేదని చూశాము. ఇప్పుడు పూరకప్రసారంలో లేని అంశాలకు, అంటే ఒకేపరిసరంలో వచ్చే ఘటికలకు గల భేదాలకు విలువ ఉందా? అన్నప్రశ్నకు జవాబివ్వడానికి ప్రయత్నిద్దాము.

---

* *కటు-గటు* అన్న తెలుగుమాటలను ఉదాహరణగా తీసికోవచ్చు. అలాగే *కంచు* అన్న దాన్ని *గంచు* అంటే అర్థమే కాదు.

ఏవైనా రెండుఅంశాల వ్యత్యాసాలకు విలువ ఉందా? లేదా? అన్నదాన్ని స్థిర పరచాలంటే, ఆ రెండూ ఒకేపరిసరంలో వచ్చితీరాలి అన్నవిషయాన్ని ఇందాకే చూశాము. మొదట వచ్చి 'తీరాలి' అన్నమాట తీవ్రతను కొద్ది తగ్గిద్దాము. ఇందాక చూపినట్లు ఈ మాట *గళ*, *అలి* మొదలైన ఘటికలకు అన్వయించదు. వేరు వేరు జాతిపదాలలో కనిపించే అంశాలవ్యత్యాసాలకు విలువ ఉందా? లేదా? అన్నప్రశ్నను స్పృశించకుండడమే మేలు. మిగిలినసందర్భాల్లో అయినా 'వచ్చి తీరాలి' అన్నమాటను 'వస్తే చాలు' అన్నట్లు ఉపయోగించడం లేదు. కొన్ని ఉదాహరణలు చూద్దాము.

కన్నడములో *ర్*, *ల్* అన్న రెండుధ్వనులున్నాయి. ఆ రెంటికీ గల భేదాలకు విలువ ఉందా? లేదా? అన్నదాన్ని నిర్ణయించడానికి, ఆ రెండూ ఒకేపరిసరంలో వస్తాయా, అన్నది మొదట చూడాలి. *ఐ-ఎ* అన్న పరిసరంలో ఆ రెండూ వస్తాయి.[1] అలాగే కన్నడంలో *అను*, *అళు* అన్న రెండు ప్రత్యయాలున్నాయి.[2] ఈ రెండూ *మాడిద్*-అన్న పరిసరంలో వస్తాయి. ఈ రెండు ఉదాహరణల్లోనూ, వివక్షలోని రెండు అంశాల భేదాలకు విలువ ఉంది అని చెప్పడానికి అవకాశం కలదని చెప్పవచ్చు. అయితే ఈ మాత్రంతోటే, ఈ విషయంలో మన మొక నిర్ధారణకు రావడం సాధ్యమా?

ఇంకో రెండు ఉదాహరణలు చూద్దాము. జపానీభాషలోనూ *ర్*, *ల్* అన్న రెండు ధ్వనులున్నాయి. ఈ రెండుధ్వనులు ఒకేపరిసరంలో వస్తాయి; *-ఓకు*, *కొ-ఎ* అన్నవి ఆ ఉదాహరణలు. నేను మాట్లాడుతున్నప్పుడు *ఈని*, *ఏనె* అన్న రెండు ప్రత్యయాలను క్రియాపదాలలో వాడుతుంటాను.[3] ఈ రెండూ ఒకే పరిసరంలో వస్తాయి. *మాడ్త్*-, *నోడ్త్*- ఇత్యాది. ఈ రెండు ఉదాహరణలు, పైన చూపిన రెండు ఉదాహరణలూ ఒకేవిధమైనవని అనిపిస్తుంది. అంచేత ఇక్కడకూడ అలాటి నిర్ణయానికే రావచ్చా?

---

1. తెలుగులో ఉదాహరణకు *ప్-ఇ* అన్నపరిసరాన్ని తీసికోవచ్చు. *పురి* *పులి* అన్న శబ్ద యుగ్మం వస్తుంది.

2. అను అన్నది మహద్వాచకాన్ని బోధించే ప్రత్యయం. అళు అన్నది మహతీ వాచకాన్ని బోధించే ప్రత్యయం. తెలుగులో మహతీవాచకాన్ని బోధించే ప్రత్యయం ప్రత్యేకంగా లేనందువల్ల, మహత్, అమహత్ ప్రత్యయాలను తీసికోవచ్చు.

3. ఈని, ఏనె అన్న రెండూ ఉత్తమపురుషాన్ని బోధిస్తాయి. 'మాడ్తీని' అన్నా 'మాడ్తేనె' అన్నా చేయుదును అని అర్థం. వీనికి నిక్కచ్చిగా సమానమైన తెలుగు ఉదాహరణలు కాకపోయినా, చేస్తాను, చేస్తును అన్నపదాలు నిదర్శనాలుగా పరిశీలించవచ్చు.

ఈ ఉదాహరణలను ఇంకోసారి చూద్దాము. మొదట ధ్వని సంబంధమైన ఉదాహరణలను చూద్దాము. కన్నడములో లకార, రేఫాలు రెండూ ఒకేపరిసరంలో వస్తాయి. *బలె-బరె* అన్న రెండుశబ్దాలను చూడవచ్చు. జపానీభాషలోకూడ లకార, రేఫాలు ఒకేపరిసరంలో వస్తాయి. *లోకు-రోకు; కోలె-కోరె* అన్న రెండు శబ్దయుగ్మాలను చూడవచ్చు. కన్నడంలో లకార, రేఫాల వినియమంవల్ల అర్థభేదం తలెత్తుతోంది. *బలె-బరె* అన్న రెండుశబ్దాల అర్థం వేరువేరు. అయితే జపానీభాషలో లకార, రేఫాల వినియమంవల్ల అర్థవ్యత్యాసం తలెత్తడంలేదు. *లోకు* అన్నా *రోకు* అన్నా 'ఆరు' అనే అర్థం. *కోలె* అన్నా *కోరె* అన్నా 'ఇది' అని అర్థం. లకార, రేఫాల భేదానికి కన్నడంలో విలువ ఉంది, జపానీభాషలో లేదు అన్నది విశదమౌతోంది. అందువల్లే రెండు అంశాలవ్యత్యాసానికి విలువ ఉందా? లేదా? అని చెప్పడానికి ఆ రెండూ ఒకేపరిసరంలో రావాలి అని చెప్పినా, 'వస్తే చాలు' అని చెప్పినట్లుమాత్రం కాదు.

ఈ మాటే *అనె-అశె; ఈని-ఏనె* అన్న యుగ్మాలనుండీ సిద్ధమౌతోంది. *మాట్టానె-మాట్టాశె* అన్నదాంట్లో అర్థవ్యత్యాసం ఏర్పడుతుంది. *మాత్తీని-మాత్తేనె* అన్నదాంట్లో కలగడం లేదు.

ఇంతవరకు సాగిన చర్చవల్ల, రెండు లేక ఎక్కువ అంశాల ప్రసారాన్ని మాత్రము పోల్చి చూపినప్పుడు రెండుసందర్భాలు కానవచ్చాయని విదితమైంది.

(1) వివక్షలోఉన్న అంశాలు ఒకేపరిసరంలో రావచ్చు.

(2) వివక్షలోఉన్న అంశాలు పరస్పర వ్యావర్తక పరిసరంలో కనిపించవచ్చు. ఒకేపరిసరంలో వచ్చేఅంశాలు అర్థభేదాన్ని కలిగించవచ్చు. కలిగించకనూ పోవచ్చు. ఈ దృష్టిలోచూస్తే వివక్షలోఉన్న అంశాలు ఒకేపరిసరంలో వచ్చాక రెండురీతుల్లో వర్తిస్తాయన్నదాన్ని చూశాము. వీటిదృష్టినుండి మొదటిసందర్భాన్ని రెండుగా విడదీయవచ్చు. అంటే మొత్తం మూడుసందర్భాలు లభిస్తాయి. ఇంకేసందర్భము ఉన్నట్లే లేదు.

(1) వివక్షలోఉన్న అంశాలు ఒకేపరిసరంలోవచ్చి, అవి శబ్దాలఅర్థాలను మార్చగలవంటే, అవి విరోధప్రసారంలో ఉన్నాయని పేర్కొనవచ్చు.

(2) వివక్షలోఉన్న అంశాలు ఒకేపరిసరంలోవచ్చి, అవి శబ్దాలఅర్థాలను మార్చలేవంటే, అవి వైకల్పికప్రసారంలో ఉన్నాయని పేర్కొనవచ్చు.

(3) వివక్షలోఉన్న అంశాలు పరస్పరవ్యావర్తక పరిసరంలోవస్తే, అవి పూర్వకప్రసారంలో ఉన్నాయని పేర్కొనవచ్చు - అన్నదాన్ని అప్పుడే చూశాము.

ఈ మూడుతత్త్వాలు భాషావిశ్లేషణకు మూలస్తంభాలు. ఈ తత్త్వాలను 'సరైన' రీతిలో వాడడంజరిగితే, మనకు రెండువిధాల మూలభూతమైన అంశాలు లభిస్తాయి. ఏ భాషలోనైనాకాని, ఈ రెండురకాల మూలభూతఘటికలు లభిస్తాయి. వీనిలో ఒక దానికి అర్థంలేకున్నా, అర్థభేదనసామర్థ్యం ఉంటుంది. దాన్ని 'వర్ణం' అని పిలువ వచ్చు. ఇంకొకదానికి అర్థం ఉంది, దాన్ని 'ఆకృతి' అని పిలువవచ్చు. ఈ రెండు మూలభూతఘటికలకు భేదం కలదని చెప్పినమాటను సులభంగా నిరూపించవచ్చు.

కన్నడంలోని *మురి-కరి* అన్న రెండుశబ్దాలను చూద్దాము.[1] ఇక్కడ మకార, కకారాలు రెండూ విరోధప్రసారంలో ఉన్నాయని స్పష్టమౌతుంది. *మాడు-కాడు* అన్న రెండు శబ్దాలను చూద్దాము. ఇక్కడా ఇలాగే మకార, కకారాలు విరోధప్రసారంలో ఉన్నాయన్నది స్పష్టమే. ఈ రెండుజంటలను *మురి : కరి : : మాడు : కాడు* అంటూ ప్రదర్శించవచ్చు.

ఇప్పుడు *మాడుత్తేనె-మాడుత్తానె* అన్న పదయుగ్మాన్ని చూద్దాము.[2] ఇక్కడ *ఏనె-ఆనె* అన్నవి విరోధప్రసారంలో ఉన్నాయనడం స్పష్టము. *ఓదుత్తేనె-ఓదుత్తానె* అన్న ఇంకోయుగ్మాన్ని చూద్దాము. ఇక్కడా అంతే. *ఏనె-ఆనె* అన్నవి రెండూ విరోధప్రసారంలో ఉన్నాయి. ఈ రెండుయుగ్మాలను *మాడుత్తేనె : మాడుత్తానె : : ఓదుత్తేనె : ఓదుత్తానె* అంటూ ప్రదర్శించవచ్చు. *మాడుత్తేనె-మాడుత్తానె* అన్న జంటలో స్వరూపదృష్టినుండి ఏ వ్యత్యాసం అగుపిస్తుందో, ఆ వ్యత్యాసం *ఓదుత్తేనె-ఓదుత్తానె* అన్నదాంట్లోనూ అగుపిస్తుందని తాత్పర్యం.

ఇది చాలా స్వారస్యకరమైన విషయం. మాడుత్తేనె-మాడుత్తానె అన్నయుగ్మం లోను, ఓదుత్తేనె-ఓదుత్తానె అన్న యుగ్మంలోనూ ఉన్న, ఒకేరకపు రూపవ్యత్యాసం

---

1. తెలుగులో *మంచు-కంచు* అన్న శబ్దాలను గ్రహించవచ్చు. రెండవజంటలోని రూపాలు తెలుగులోనూ ఉన్నాయి.

2. చేస్తాను-చేస్తాడు అని అర్థం. ఇక్కడ *ను-డు* అన్నవి విరోధప్రసారంలో ఉన్నాయి. ఆ రెండుజంటల సమానరూపాలను ఇలా ప్రదర్శించవచ్చు. చేస్తాను : చేస్తాడు : : చదువుతాను : చదువుతాడు.

వల్ల, ఒకేరకపు అర్థవ్యత్యాసమూ ఏర్పడుతోంది. అయితే ముది-కుది అన్న జంట లోనూ మాడు-కాడు అన్న జంటలోనూఉన్న ఒకేరకపు రూపవ్యత్యాసంవల్ల, ఒకే రకపు అర్థవ్యత్యాసం కలగడంలేదు. అందువల్లే భాషలో రెండువిధాలైన మూలఘటిక లున్నాయనీ, వానిలో ఒకదానికి అర్థం లేదనీ, ఇంకోదానికి అర్థం ఉందనీ చెప్పింది.

ఈ రెండు మూలఘటికలవిషయంగా ఇతోధికవివరాలను రాబోయే ఉపన్యాసంలో గమనిద్దాము.

# వర్ణనాత్మక వ్యాకరణ మూలతత్త్వాలు-౨

## వర్ణము - ఆకృతి - పదము

ఏ భాషలోనైనా కానీ, రెండు విధాల మూలఘటికలు ఉన్నాయి. అందులో ఒక దానికి అర్థం లేదు. ఇంకొకదానికి అర్థం ఉంది. అర్థం లేని ఘటికను వర్ణమని, అర్థంగల ఘటికను ఆకృతి అని పిలువవచ్చు అన్న విషయాలను మొదటి ఉపన్యాసంలో వివరించడమైంది. వర్ణమన్నదాని స్వరూపాన్ని కొంత సంగ్రహంగానూ, ఆకృతి అన్నదాని స్వరూపాన్ని కొంత వివరంగానూ ప్రస్తుత ఉపన్యాసంలో తెలుపుటకు ప్రయత్నిస్తాను. చివరలో పదమన్నదానిగురించికూడ కొన్ని మాటలు చెబుతాను.

మొదట వర్ణమన్నదాని స్వరూపాన్ని తెలుసుకొందాము. మనము దేన్నయినా చెబుతున్నప్పుడు నోటినుండి వెలువడే శబ్దాలను 'ధ్వనులు' అని పిలుద్దాము. 'కుమార' అన్న శబ్దాన్ని పదిసార్లు ఉచ్చరించండి. ఈ పదిసార్లూ ఆ శబ్దంయొక్క ఆదిలో 'క్' అన్న హల్లునే ఉచ్చరిస్తాము. 'క్' అన్న వ్యంజనాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు మనకు తెలియకనే ఈ శబ్దంయొక్క పది పునరుక్తులకు సామాన్యమైన ఒక ఘటికను సాధారణీకరణంవల్ల కల్పించుకొని విడిచిపెడుతున్నాము. వాస్తవానికి మనం విన్నవి పది వేరే వ్యంజనాలను. అయితే ఈ వేరు వేరు వ్యంజనాలకున్న (ఉండతగ్గ) భేదాలు అత్యల్పమైనందున అవి మనకు గోచరం కావడంలేదు.

మిగిలిన ఇంద్రియకార్యాలనుండి ఒక పోలికను ఇవ్వవచ్చు. క్రొత్తగా అంగడినుండి తెచ్చిన టెన్నిస్‌బంతుల పెట్టెనుండి రెంటిని తీసికొందాము. వాటి ఆకారం, రంగు, బరువు అన్నీ ఒకేలాగున్నాయి. ఆ రెంటినీ ప్రత్యేకించడానికి మాంచి టెన్నిస్ ఆటగానికీకూడ సాధ్యంకాదు. ఆయినా ఉన్నది ఒక్క చెండుకాదు. రెండు. ఆ రెండు వేరు వేరే. ఎందుకంటె అవి ఆక్రమించిన స్థానాలు వేరువేరుగా ఉంటాయి. ఆ బంతులను సూక్ష్మదర్శినినుండి పరీక్షించినపుడు ఒకదాంట్లో వెంట్రుకలజూలు వక్రంగా ఉంటుంది. ఇంకొకదాంట్లో చక్కగా ఉంటుంది. కాని ఇంతటి ఖచితత్వం నిత్యదైనందిన వ్యవహారాలకు అప్రయోజనకరమైంది. అలాగే మన పది కకారాలసంగతికూడా. టెన్నిస్‌బంతులు వేరువేరు స్థానాలను ఆక్రమించినట్లే, ఆ పది కకారాలూ వేరువేరు క్షణాల్లో ఉచ్చరితమైనందువల్ల, అవి వేరువేరు వ్యంజనాలే. ధ్వనితరంగాలను పరీక్షించేయంత్రంతో వాటిని పరీక్షిస్తే, ఒక్కొక్కదానికీ కొద్దిపాటి తేడా అగుపించ

వచ్చు. అయితే దైనందిన వ్యవహారాలకు ఈ వ్యత్యాసాలను పాటించాల్సిన అవసరం లేదు.

ధ్వని శాస్త్రజ్ఞుడు అభ్యసించేది, ఈ ప్రత్యేకధ్వనులను కాదు. అనేక ప్రత్యేక ధ్వనులనుండి లభించే సాధారణీకృత ధ్వనులనే. 'కుదురె' అన్నశబ్దాన్ని పదిసార్లు కాదు, నూరుసార్లు ఉచ్చరించండి. దాన్ని ఉచ్చరించేవారు ఎవరైనా కాని, ఆశబ్దం యొక్క మొదటి హల్లును సూచించడానికి అతడుపయోగించే సంకేతం 'క్' అన్న దొక్కటే. అందువల్ల ధ్వనులగురించి ముందుగా మాటాడుతున్నప్పుడు. ఈ సాధారణీ కృతధ్వనులు మాత్రమే వివక్షలో ఉన్నాయని జ్ఞాపకముంచుకోవాలి.

*కరి, గరి, తరి, నరి, పరి, మరి, సరి, హరి* అన్నశబ్దాలను చూడండి.[1] ఈ శబ్దాలన్నిటిలోనూ - ఉరి అన్నభాగం సమానంగా ఉంది. క్, గ్, త్, న్, ప్, మ్, స్, హ్ అన్నధ్వనులు ఒకేపరిసరంలో వచ్చాయి. కాకపోతే ఈ శబ్దాల అర్థాలన్నీ వేరువేరు. అంటే ఈ వ్యంజనాలు విరోధప్రసారంలో ఉన్నాయని తెలుస్తోంది. అందువల్ల ఈ వ్యంజనాలకున్న వ్యత్యాసాలు విశిష్టమైనవని అనికూడ అర్థమౌతోంది. ఇలాగ శబ్దాల అర్థాన్ని మార్చేధ్వనులకు 'వర్ణము'లని ప్రస్తుతానికి పేరిద్దాము, వర్ణమన్నదాని అర్థాన్ని ఇకముందు మరికొంత పరిష్కరిద్దాము.

ఇప్పుడు *డొళ్ళ కాడు* అన్నశబ్దాలను చూద్దాము.[2] *డొళ్ళ* అన్నశబ్దంలోని మొదటి వ్యంజనానికి *కాడు* అన్నదాని స్వరమధ్యవ్యంజనానికి ఉచ్చారణలో భేదం ఉంది. ఈ రెండు భిన్నధ్వనులే. ధ్వనిశాస్త్ర పరిభాషమేరకు పేర్కొనాలంటే *డొళ్ళ* లోని డకారాన్ని ఘోష మూర్ధన్యస్పర్శమని, *కాడు* లోని డకారాన్ని ఘోష మూర్ధన్య తాడిత మనీ పిలువవచ్చు. ఈ రెండూ ఘోష మూర్ధన్యాలైనందువల్ల, ఈ రెంటికీ సాదృశ్యం ఉంది. అయితే ఈ రెండు భిన్నధ్వనుల తేడాకు విలువ ఉందా? లేదా?....కన్నడ శబ్ద కోశాన్ని తలక్రిందులుచేసి చూసినా, ఆ రెండుధ్వనులు తమ వ్యత్యాసంవల్ల అర్థభేదం కలిగించడం లేదన్నది విదితమౌతుంది. స్పర్శ డకారానికీ, తాడిత డకారానికీ ఉన్న తేడా చాలా తక్కువైనందువల్ల, ఆ రెంటికి అర్థభేదం కలిగించేటంత సామర్థ్యం లేదని ఆక్షేపించవచ్చు,

---

1. *కని, గని, చని, పని, మని, శని* అన్న తెలుగు ఉదాహరణల్లో—*అని* అన్నభాగం సమానం.

2. *డొల్ల-కాడు; డాబు-మూడు* వంటి తెలుగుశబ్దాలు ఉదాహరణలు.

ఈ ఆక్షేపణకు విలువ ఉందా? లేదా? అన్నది పరీక్షిద్దాము. స్పర్శ దకారం, తాడిత డకారమూ శబ్దాల అర్థాన్ని మార్చగలవు అన్నదాన్ని ఇంకొకభాష ఆధారంవల్ల చూపితే ఈ ఆక్షేపణ తేలిపోతుంది. ఇప్పుడు ఒడియాభాషలోని రెండుశబ్దాలను చూద్దాము. *కడమ్* అని స్పర్శ దకారంతోటి ఉచ్చరితమయ్యే శబ్దానికి 'దోపిలి' అని అర్థం. *కడమ్* అన్నదాన్ని తాడిత డకారంతోటి ఉచ్చరిస్తే 'చేతిగాజు' అని అర్థం. అందువల్ల స్పర్శ దకారానికి, తాడిత డకారానికి శబ్దాల అర్థాలను మార్చేసామర్థ్యం ఉంది; అయితే ఈ సామర్థ్యాన్ని కన్నడభాష ఉపయోగించుకోలేదనిమాత్రం చెప్పాలి.[1]

ధ్వనిశాస్త్ర శిక్షణలేని కన్నడిగుని అడిగితే, *డొళ్ళ-కాడు* అన్నశబ్దాల రెంటిలోనూ ఉన్న డకారం ఒకటే అని చెప్తాడు. ఇది కేవలం లిపి సాదృశ్యంవల్ల చెప్పిన మాట కాదు, అతనిచెవికి ఈ రెండూ భిన్నంగా వినపడడంలేదు. పైన చెప్పిన ఒడియా భాష మాటాడేవ్యక్తికి, తాను వాడే రోమన్ లిపిలో ఈ కన్నడశబ్దాలను వ్రాసికొమ్మని చెబితే 'డొళ్ల' అన్నదాన్ని డకారాన్ని ḍ అన్న చిహ్నంతోనూ, 'కాడు' లోని డకారాన్ని ṛ అన్న చిహ్నంతోనూ సూచిస్తాడు. ఇక్కడ ధ్వని వ్యవస్థగురించి మొదటి ఉపన్యాసంలో చెప్పినమాటలను స్మరించాలి.

పుట్టినప్పటినుండి కన్నడంలోనే మాట్లాడుతూ, దాంట్లోనే మునిగితేలుతున్న కన్నడిగునిమాటను నమ్మాలా? ధ్వనిశాస్త్రంలో విశేషశిక్షణపొంది నిశితశ్రవణంగల ధ్వనిశాస్త్రజ్ఞునిమాట నమ్మాలా?.... ఇద్దరు చెప్పేదీ నిజమే అని వర్ణశాస్త్రజ్ఞుడు చెప్తాడు.

ధ్వనిశాస్త్రంప్రకారం ఈ రెండు డకారాలూ విభిన్నమైనవే. అయితే వానికున్న భేదానికి ప్రస్తుతం విలువలేదు. కన్నడంలో స్పర్శ దకారమూ, తాడిత డకారమూ పూరకప్రసారంలో ఉన్నాయి: స్పర్శము #-, డ్-, ణ్-, ళ్- (డొళ్ళ-కడ్డి-హెండ్డ-డాళ్డా) అన్న పరిసరాల్లోనూ, తాడితము అచ్చుల మధ్యలోనూ వస్తాయి.[2] అందువల్లే ఈ రెంటికీ ఉన్నవ్యత్యాసానికి విలువలేదు. ఇప్పుడు *డుబ్బు-రుబ్బు*, *ఆడు-అరు*[3] అన్న రెండు కనిష్ఠయుగ్మాలను చూడండి. మొదటిజంటలో స్పర్శ డకారమూ, రేఫమూ విరోధ ప్రసారంలో ఉన్నాయి. రెండవయుగ్మంలో తాడిత డకారమూ, రేఫము విరోధప్రసారంలో ఉన్నాయి. ఇప్పుడు *రాము-కాము*, *హాకు-హారు*[4] అన్న రెండుజంటలను చూడండి.

---

1. తెలుగుకూడ.

2. తెలుగులోకూడ అంతే, ళ్-బదులు, ల్-వస్తుంది. డుబ్బు-అడ్డు-అండ-డాల్డా [వ్యం కూడ ఉ-వడ్లు]   3. డోలు-రోలు, ఆడు-అరు.   4. రాము-కాము, ఆకు-అరు.

మొదటిజంటలో రేఫము, డకారమూ; అలాగే రెండవదాంట్లో డకారమూ, రేఫమూ
విరోధప్రసారంలో ఉన్నాయి. డకారముకతే చేసేపనిని రెండురకాల డకారాలు చేస్తు
న్నవి. అందువల్ల ఈ రెండు డకారాలూ వినియోగదృష్టినుండి ఒక్కటే-ఇంకొక
స్వారస్యంకూడ ఉంది. డుబ్బు-రుబ్బు అన్న జంటలో డకారానికీ, రేఫానికీ వ్యత్యాసం
ఏమిటి? డ్ అన్నది ఘోషం. ర్ అన్నది ఘోషమే. అంచేత ఘోషత్వవిషయం
వద్దు. డ్ అన్నది మూర్ధన్యమూ, స్పర్శము. రేఫము వర్త్స్యము, తాడితము. కాబట్టి
డకారానికీ, రేఫానికీ ఉన్న తేడాలివి: ఒకటి మూర్ధన్యము, రెండవది వర్త్స్యము;
ఒకటి స్పర్శము, రెండవది తాడితము. ఇప్పుడు అరు-అడు అన్నయుగ్మాన్ని చూద్దాము.
రేఫమూ, తాడిత డకారమూ విరోధప్రసారంలో ఉన్నాయి. ఈ రెండు ధ్వనులకు తేడా
ఏమిటి? రేఫమూ, ప్రస్తుత డకారమూ రెండూ ఘోష, తాడితాలే. అందువల్ల ఘోష
త్వము, తాడితత్వముల ప్రసక్తి వద్దు. ఈ రెంటికీ ఉన్న తేడా ఒకటే; రేఫము
వర్త్స్యము. తాడిత డకారం మూర్ధన్యము. స్థానభేద మొకదానివల్లనే రేఫ-తాడిత
డకారాలు రెండూ అర్థాన్ని మార్చగలవని విదితమవుతుంది. ఇప్పుడు మళ్ళీ డుబ్బు-రుబ్బు
అన్నయుగ్మాన్ని చూద్దాము. ఇక్కడ డకారం మూర్ధన్యము. రేఫము వర్త్స్యము.
అడు-అరు అన్న జంటలో ఉన్నట్లే ఉన్నాయి. అడు అన్నదాంట్లోని డకారంయొక్క
తాడితఅంశానికి విలువలేదు. అలాగే డుబ్బు అన్నదాంట్లోని డకారంయొక్క స్పర్శ
తకూ విలువలేదని చూపవచ్చు. డెగె-బెగె అన్న శబ్దయుగళాన్ని చూడండి.* ఇక్కడ
డకారం, బకారం విరోధప్రసారంలో ఉన్నాయి. డకారానికీ, బకారానికీ వ్యత్యాస
మేమిటి? ఆ రెండూ ఘోష, స్పర్శాలు కావడంవల్ల ఘోషత్వ, స్పర్శత్వాల ప్రసక్తి
అక్కఱలేదు. డకారం మూర్ధన్యమూ, బకారం ఓష్ఠ్యము. అంచేత రేఫ-తాడిత డకా
రాలు స్థానభేద మొకదానివల్లనే శబ్దాల అర్థాలను ఎలా మార్చగలవో, అలాగే డకార,
బకారాలు రెండూ కేవలం స్థానభేదంవల్లనే, శబ్దాల అర్థాలను మార్చగలవు. స్పర్శ
డకారమూ మూర్ధన్యమే, తాడిత డకారమూ మూర్ధన్యమే. అందువల్లే 'ఆ రెండూ
ఒకటే' అన్నమాటలో అలంకారికోక్తిని ప్రయోగించడంలేదు. డ్ అన్నది తన
ఏ ఒక్క అంశంవల్ల శబ్దాల అర్థాలను మార్చగలదో, అదే అంశంవల్ల తాడిత డకా
రమూ శబ్దాల అర్థాలను మార్చగలదు. అంచేతే ఆ రెండూ ఒకటే అనడంలో తప్పు
లేదు.

అందువల్ల వర్ణమంటే కొన్ని విలువగల అంశాల గ్రంథి. అది ధ్వని కాదు. ఈ
గ్రంథిలో డకారవిషయంగా పైన చెప్పినట్లు, ఒకే అంశంగలిగి ఉండవచ్చు. ఈ విలువ

---

* తెలుగులో డాబు-బాబు అన్నయుగళం ఉదాహరణ.

గల అంశాలను మౌలికాంశాలని పిలువవచ్చు. ఇంకా కొన్ని ఉదాహరణలు చూద్దాము. (ఈ వివేచన స్థూలమైనది మాత్రమేనని మీరు గమనించాలి.)

కన్నడంలోని లకారాన్ని చూద్దాము. కాలు-కాళు అభేదంవల్ల లకారంయొక్క వర్త్స్యాంశం విలువ గలిగినట్టిదే అని అర్థమౌతుంది. అలాగే నల్లె-లల్లె అన్నదాన్నుండి లకారంయొక్క పార్శ్వికాంశం విలువైనదనే అర్థమౌతుంది. అది ధ్వనిశాస్త్రదృష్టి నుంచి ఘోషమైనా, వర్ణశాస్త్రందృష్టినుండి దాని ఘోషత్వానికి విలువలేదు. అందువల్ల కన్నడంలోని లకారం పార్శ్వత్వం, వర్త్స్యత్వం అన్న మౌలికాంశాలగ్రంథి. ళకారం యొక్క మౌలికాంశాలు ఏవి కాలు-కాళు అన్నదాన్నుండి మూర్ధన్యాంశమూ, కాళు-కాడు అన్నదాన్నుండి పార్శ్వత్వమూ దాని మౌలికాంశాలని అర్థమౌతుంది.[1]

చివరగా ఒక ఉదాహరణను చూద్దాము. కన్నడంలో ఆరు అనునాసిక ధ్వను లున్నాయి. దంత్యము (నత్తె), వర్త్స్యము (నాను), మూర్ధన్యం (హణ), తాలవ్యము (పఞ్చ), కంఠ్యము (తఙ్గి), ఓష్ఠ్యము (అమె). ఇప్పుడు అమె-అనె-అణె అన్న శబ్దాల నుండి మ్-న్-ణ్ అన్నవి విరోధప్రసారంలో ఉన్నాయని అర్థమౌతుంది.[2] మాడు-బాడు అన్నదాన్నుండి మకారంలోని నాసిక్యము ఒక మౌలికాంశమని తెలు తుంది.[3] కాడు-కాణు అన్నదాన్నుండి ణకారంయొక్క నాసిక్యమూ ఒక మౌలికాంశ మని తెలుతుంది. అమె-అణె అన్నదాన్నుండి మకారంలోని ఓష్ఠ్యాంశమూ, ణకారంలోని మూర్ధన్యాంశమూ మౌలికాంశాలని అర్థమౌతాయి. అలాగే నకారంలోని వర్త్స్యాంశమూ మౌలికాంశమేనా? అలె-అనె[4] అన్నదాంట్లో లకార, నకారాలు రెండూ వర్త్స్యాలవడం వల్ల, వానిలో వర్త్స్యాంశము మౌలికాంశము కాదనిపిస్తుంది. అయితే అమె-అనె అన్న దాన్నుండి, అనె-అణె అన్నదాన్నుండి నకారంయొక్క వర్త్స్యాంశానికి విలువ కలదని పిస్తుంది. ఈ సందిగ్ధతనుండి బయటపడేది ఎలా? వర్త్స్యమూ, కాకుంటే ఓష్ఠ్య, మూర్ధన్యాలనుండి భిన్నమైన రెండంశాలున్నాయని చెప్పాల్సివస్తుంది. అందువల్ల కన్నడంలోని నకారం మూడు మౌలికాంశాల కూడిక. నాసిక్యము, ఓష్ఠ్యభిన్నత, మూర్ధన్యభిన్నత అన్నవే ఆ మూడు మౌలికాంశాలు. మునుపటి ఉపన్యాసంలో దంత్య నకారం, వర్త్స్య నకారం, తాలవ్య ఞకారం, కంఠ్య ఙకారం, ఇవి నాలుగూ పూరక ప్రసారంలో ఉన్నవని చెప్పినదాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. అందువల్ల ఈ నాలుగింటికి

---

1. తెలుగు ఉదాహరణం—*కల కళ; నాగు-లాగు; కల-కళ; కళ-కడ*

2. తెలుగు ఉదాహరణం—*జామ-జాన-జాణ*

3. తెలుగు ఉదాహరణం—*మాట-బాట*    4. తె. ఉ. *అలు-అను*

సామాన్యమైన మూడు మౌలికాంశాలు లేవంటే, నాసిక్యత, ఓష్ఠ్యభిన్నత, మూర్ధన్య భిన్నతలని గమనించాలి.

అందువల్ల కన్నడంలో మూడే అనునాసిక వర్ణాలు. మ్ అన్నది వ్రాయాలన్నప్పుడు వర్ణము ఓష్ఠ్యత్వమూ, నాసిక్యతల గ్రంథి. ణ్ అన్నది వ్రాయాలన్నప్పుడు వర్ణము మూర్ధన్యమూ, నాసిక్యతల చేరిక. న్ అన్నది వ్రాయాలన్నప్పుడు వర్ణము నాసిక్యతా, ఓష్ఠ్యభిన్నతా, మూర్ధన్యభిన్నత అన్న మూడుఅంశాల కూడిక.

పైన 'వ్రాయాలన్నప్పుడు' అన్నమాట వచ్చింది. వర్ణాన్ని సూచించుటకు, ధ్వనిని సూచించుటకు ఒకే చిహ్నాన్ని ఉపయోగించినా వాని విలువలుమాత్రం వేరే అన్నదాన్ని మరువరాదు. సందిగ్ధతలు తలెత్తకుండా, వర్ణాలను నిర్దేశించే చిహ్నాన్ని వంపుగీతలమధ్యలోనూ, ధ్వనులను నిర్దేశించే చిహ్నాన్ని చతురస్రాకారపు బ్రాకెట్ల మధ్యలోనూ పెట్టడం పరిపాటి. /మ్/ అంటే వర్ణమనీ, [మ్] అంటే ధ్వని అని సంకేతం.

ఇలాగ మౌలికాంశాలగ్రంథులే వర్ణాలు. ఈ వర్ణాలు ధ్వనులుగా అవతరిస్తాయని చెప్పవచ్చు. ఒకేవర్ణానికి అనేక అవతారాలుంటే, వానిని ఆ వర్ణంయొక్క ధ్వని ప్రభేదాలని పిలుస్తారు. కన్నడంలో /క్/ అన్న వర్ణానికి ఒకే అవతారం. /డ్/ అన్నదానికి రెండు అవతారాలు. అంటే /డ్/ అన్నవర్ణానికి రెండు ధ్వని ప్రభేదాలన్నమాట. అలాగే /న్/ అన్నదానికి నాలుగు అవతారాలు, అర్థాత్ ధ్వనిప్రభేదాలు.

భిన్నభిన్నభాషల్లో ఒకే చిహ్నంతో వ్రాయబడే వర్ణాలకు, ఒకే మౌల్యం ఉందని భావించరాదు. కన్నడంలోని /ల్/ అన్నవర్ణానికి [ల్] అన్న అవతారం (realisation) ఉంది. బర్మీ భాషలోని /ల్/ అన్న వర్ణానికికూడ [ల్] అన్న అవతారం ఉంది. అయితే కన్నడంలోని /ల్/ అన్నది వర్త్స్యత్వమూ, పార్శ్వత్వముల ఒక గ్రంథిమాత్రమే; దాని అవతారం ఘోషమైనప్పటికీ, ఘోషత్వము దాని మౌలికాంశం కాదు. బర్మీభాష లోని ఘోష లకారమూ, అఘోష లకారమూ విరోధప్రసారంలో ఉన్నాయి. కాకుంటే, వేరేస్థానపు పార్శ్వికాలు లేవు. అందువల్ల బర్మీభాషలోని /ల్/ అన్నవర్ణం ఘోషత్వం, పార్శ్వత్వం అన్న రెండు మౌలికాంశాల గ్రంధి.

వర్ణమన్నదానివిగురించి ఈమాత్రం చాలనిపిస్తోంది. ఇక 'ఆకృతి' అన్నదాని స్వరూపాన్ని తెలిసికొందాము.

మొదట 'వర్ణాకార'మంటే ఏమిటో తెల్సుకోవాలి. అవిభాజ్యమైన, అర్థవంతమైన వర్ణాల సముదాయానికి 'వర్ణాకారం' (Morph) అన్న పేరివ్వవచ్చు. ఈ సూత్రాన్ని కొద్ది వివరంగా చూద్దాము.

*బరెదను* అన్న శబ్దాన్ని చూద్దాము.[1] ఇది మన సూత్రప్రకారం వర్ణాకారమా? బరెదను (వ్రాయుదును) అన్నది అర్థవంతమైనది; అది వర్ణాలసముదాయమూ అవుతుంది. అయితే అది అవిభాజ్యము కాదు, విభాజ్యమే. బరె-ద్-ఉను అని విడదీయవచ్చు. ఇలా విడదీయగా వచ్చిన మూడుముక్కలకు అర్థమున్న విషయాన్ని గమనించాలి.

*బరె* అన్నదాన్ని చూద్దాము. ఇది మన సూత్రప్రకారం వర్ణాకారమా? బరె అన్నది అర్థవంతమైనది. అది వర్ణాల సముదాయంకూడ. అది అవిభాజ్యమైనట్టిదే. బరె అన్నదాన్ని బ్-అ-ర్-ఎ అన్న నాలుగు ముక్కలుగా కాని, బ-రె, బర్-ఎ, బ్-అరె అన్న రెండు రెండు ముక్కలుగాకాని, బ్-అ-రె, బ-ర్-ఎ అన్న మూడు ముక్కలుగా కాని విడదీయవచ్చు. నిజమే. ఈ అర్థంలో అది విభాజ్యమే. సూత్రంలో ఉన్న వర్ణ సముదాయమన్న మాటవల్లనే ఇది సాధ్యమౌతోంది. మొదటి ఉపన్యాసంలో పేర్కొన్న 'ద్వైవిధ్యత' ఫలమిది. అయితే ఇలాగ విభజించాక వచ్చేవి, అర్థంలేని భాగాలు మాత్రమే. అర్థనాశనం ఏర్పడుతుంది.

హళగన్నడంలోని *మాడు* అన్నదాన్ని చూద్దాము.[2] ఈ శబ్దాన్ని మ్-ఆడు అని విభజించవచ్చు. ప్రథమావిభక్తి ప్రత్యయమైన మ్ అన్నదాన్ని జ్ఞాపకం ఉంచుకొంటే, మ్-ఆడు అన్న రెంటికీ అర్థముంది. అయితే ఈ భాగాలకున్న అర్థానికి 'మాడు' (చేయు) అన్నదాని అర్థానికి ఏ సంబంధమూ లేనందువల్ల, ఇక్కడా అర్థనాశనం ఏర్పడిందనే చెప్పాలి.

అందువల్ల 'అవిభాజ్య' మంటే, విభజిస్తే అర్థనాశనం కానిది అని అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. ఇక సూత్రంలో ఉన్న 'అర్థవంతమైన వర్ణసముదాయ'మన్నదాన్ని చూద్దాము. 'బరె' అన్నదాంట్లో నాలుగు వర్ణాలుమాత్ర మున్నాయి. ఈ నాలుగువర్ణాలు ఏ క్రమంలో వచ్చినా సాగుతుందనడం లేదు. రెబ అనికాని, అ ఎ్రబ్ అనికాని, అ ఎర్బ

---

1. తెలుగు ఉదాహరణం—వ్రాయుదును అన్నదాన్ని తీసికోవచ్చు.

2. *మాట* అన్న తెలుగుమాటను ఇలాగే విభజించడానికి అవకాశం ఉంది. అయితే అర్థనాశనం తప్పనిసరి.

అనికాని వస్తే అర్థం కాపడంలేదు. అందువల్ల 'అర్థవంతమైన' అన్న విశేషణం తప్పనిసరి.

అర్థవంతమైన అన్నదాని ప్రస్తావనవచ్చాక, దానికి సంబంధించిన ఇంకో రెండు విషయాలను చూడవచ్చు. బరె (ఉత్తరాన్ని 'వ్రాయడం'), బరె ('వాత' వేయడం) అంటూ వేరువేరు అర్థాలున్నా, ఒకే అనుపూర్వికిత ఉన్నరూపాలను ఏం చేయాలి? ఉన్నది బరె అన్న ఒకే వర్ణాకారం; అయితే రెండు అర్థాలున్నాయని చెప్పడమా? లేక ఉన్నది రెండు వర్ణాకారాలు, వాటిరూపం ఒక్కటే అని చెప్పడమా? రెండు వర్ణాకారాలున్నాయని చెప్పడమే పరిపాటి. *పది* (నీళ్లు 'త్రాగు'). *పది* (లేత 'చిగురు'). కాడు (అది పెద్ద అడవి), *కాడు* (వాడు నక్షత్రకునిలా 'పీడి'స్తున్నాడు) అన్నదీ ఇలాంటివే.

ఈ పరిస్థితికి విరుద్ధమైన పరిస్థితికూడ ఉన్నది. *బిళు—బిద్దను, కిళు—కిత్తను* మొదలైన జంటలను చూడండి, *బిళు, బిద్* -అన్న రెంటికీ ఒకే అర్థం; అలాగే *కిళు, కిత్* -అన్న రెంటికీ ఒకే అర్థం. అయితే రూపంమాత్రం వేరు. బిళు, బిద్ అన్నవి రెండు వర్ణాకారాలా? లేక ఒకే వర్ణాకారమా? రెండు అన్నదే సమాధానం.[1]

ఈ విషయాన్ని ఇలా టేబిల్‌లో ప్రదర్శించవచ్చు.

| రూపము | అర్థము | వర్ణాకారాలసంఖ్య |
|---|---|---|
| సమానము | సమానం | ఒకటి |
| సమానం | భిన్నము | ఒకటికంటె ఎక్కువ (భిన్నార్థాలు ఉన్నవన్ని) |
| భిన్నము | సమానం | ,, (భిన్నరూపాలు ఉన్నవన్ని- |
| భిన్నము | భిన్నము | ,, |

ఇక వర్ణసముదాయమన్నదాన్ని చూద్దాము. 'బరెదను' అన్నదాన్ని బరె-ద్-అను అంటూ విభజించవచ్చని చూశాము. ఈ మూడు విభాగాల్లోనూ 'బరె, అను' అన్న వానినేమొ వర్ణసముదాయాలని పిలువవచ్చు. అయితే 'ద్' అన్నదాన్ని వర్ణసముదాయమనడానికి అవుతుందా? ఒకే వర్ణాకారం ఉండడంవల్ల, అది అవిభాజ్యమే. దానికి అర్థంకూడ ఉంది. వర్ణాకారమని పిలువడానికి తగ్గ రెండు లక్షణాలూ ఉన్నాయి, కాని

1. *వ్రాయు-వ్రాశాను, చేయు చేశాను* అన్న జంటల్లోని *వ్రాయు; వ్రాశ్; చేయు- చేశ్* అన్నమాటలు ఇలాటి సందేహాన్నే కలిగిస్తాయి. వీటికన్న ప్రసిద్ధమైన ఉదాహరణ—వచ్చు-రా అన్నమాటలు.

దాన్ని 'వర్ణసముదాయ' మనడానికి సాధ్యం కాదు, అన్న ఒక్కకారణంనుండీ దానికి వర్ణాకారపదవి తప్పించడంకంటె, దాన్నీ వర్ణసముదాయమని పిలిచి, ఈ సముదాయం లోఉన్న వర్ణాలసంఖ్య ఒక్కటే ఒకటంటే మంచిది. అందువల్ల 'వర్ణసముదాయ' మన్నమాటనుండి రెండు లేక ఎక్కువసంఖ్యలో వర్ణాలు వివక్షితమగుట లేదు, ఒకటి లేక ఎక్కువసంఖ్యలో వర్ణాలు వివక్షితమౌతాయి—అన్నవిషయాన్ని గమనించాలి.

వర్ణాకారమంటే ఏమిటో ఇప్పటికి అర్థమై ఉండవచ్చు. ఇప్పుడు కలిగేప్రశ్న ఇది: ఒకభాషలోని వర్ణాకారాలను మూలఘటికలుగా పరిగణించవచ్చా? లేక, ధ్వనులను మూలఘటికలుగా పరిగణించకుండా వాటిని వర్ణాల అవతారాలుగామాత్రం పేర్కొన్నట్లు, వర్ణాకారాలనుకూడ ఇతర మూలఘటికలయొక్క అవతారాలుగా పరిగణించవచ్చా?

పాతకన్నడంనుండి ఒక ఉదాహరణను చూద్దాము. పేళ్వం. పేళ్దం అన్న శబ్దాలను చూద్దాము; పేళ్ అన్న ఒకే వర్ణాకారం రెండు శబ్దాల్లోనూ కనిపిస్తోంది. ఇక *బీళ్వం బిళ్దం* అన్న శబ్దాలను చూద్దాము; *బీళ్, బిళ్* అన్న రెండు వర్ణాకారాలు కనిపిస్తాయి. పేళ్ అన్న ఒకే వర్ణాకారము వచ్చే రెండు ప్రదేశాల్లోనూ, ఒకదాంట్లో బీళ్ అన్నది ఇంకొకదాంట్లో బిళ్ అన్నది కనిపిస్తాయి. బీళ్వం అన్నదాంట్లో బీళ్ అన్న దానికి ఏ మర్థమో, అదే అర్థం బిళ్దం అన్నదాంట్లో బిళ్ అన్నదానికి ఉంది. పేళ్ అన్న ఒకేవర్ణాకారము చేసేపనిని బీళ్, బిళ్ అన్నవి పంచుకొన్నాయి. అందువల్లే బీళ్, బిళ్ అన్న రెండు వర్ణాకారాలకు మూలంలో ఒకే ఘటిక ఉన్నదనీ, ఆ ఘటిక యొక్క అవతారాలే బీళ్-బిళ్ అన్నవనీ తెలుస్తుంది. బీళ్, బిళ్ అన్నవి పూరక ప్రసారంలో ఉన్నాయన్నా, పైమాటకు దోహదమే అవుతుంది. బిళ్ అన్నది వర్తమాన-భూత ప్రత్యయాల పూర్వంలోనూ, బీళ్ అన్నది మిగిలిన ప్రదేశాల్లోనూ వస్తాయి

వర్ణాకారాలను అవతారాలుగా కలిగిన మూలఘటికకు 'ఆకృతి' అన్న పేరివ్వవచ్చు. ఆకృతులను నిర్దేశిస్తున్నప్పుడు, వాటిని పుష్పకుండలిలో ఉంచుట పరిపాటి. బీళ్, బిళ్ అన్న వర్ణాకారాలను అవతారాలుగా కలిగిఉన్న ఆకృతిని {బీళ్} అని వ్రాసి చూపవచ్చు. బీళ్ అన్న వర్ణాకారాన్ని {బీళ్} అన్న ఆకృతినీ ఒకేవిధంగా వ్రాసినప్పటికీ, ఆ రెండూ వేరువేరు స్థాయిల్లోని ఘటికలవడం మరువరాదు. {బీళ్}

---

* తెలుగుతో చేయుము, చేసితిని అన్న రూపాల్లోని {చేయ్}, {చేస్} అన్న ధాతువులను సమాన ఉదాహరణగా తీసికోవచ్చు.

అవి ఉన్నప్పుడు వర్ణసముదాయం కాదు. బీట్ అని ఉంటె వర్ణసముదాయం. ఆ రెంటిని ఒకేవిధంగా వ్రాసింది, కేవలం సౌకర్యంకోసమన్నది మరువరాదు

ఒకే వర్ణముయొక్క అవతారాలను ధ్వనిప్రభేదాలన్నట్లే. ఒకే ఆకృతియొక్క అవతారాలను వర్ణాకారప్రభేదాలని పిలువవచ్చు.

ఒకవర్ణానికి ఒక అవతారమున్నట్లు, ఒక ఆకృతికీ ఒకే అవతార ముండవచ్చు. ఉదాహరణకు § పేజ్ § అన్న ఆకృతికి ఒకే అవతారం. అది పేజ్ అన్నదే.

ఆకృతి, వర్ణాకారప్రభేదం, వర్ణాకారం అన్నశబ్దాలను అర్థం చేసికోవడానికి ఇంకా రెండు ఉదాహరణలు చూద్దాము. మొదట క్రొత్తకన్నడంలోని బహూవచన ప్రత్యయాన్ని చూద్దాము. బహూవచన 'ప్రత్యయాన్ని' అంటూ ఏకవచనంలో ఉద్దేశ్య పూర్వకంగానే చెప్పాను. ఎందుకంటె కన్నడంలో బహూవచనాన్ని సూచించే మూల ఘటిక ఒక్కటే. ఆ ఘటికకు *గళు, అందిరు, అరు, కళు* అన్న నాలుగూ వర్ణాకార ప్రభేదాలే. స్థూలంగా చెప్పాలంటే *గళు* అన్నది నపుంసకలింగ ప్రాతిపదికలమీదా, *గురు* మొదలైన మరికొన్ని ప్రాతిపదికలమీదా వస్తుంది. (*మరగళు- నాయిగళు, పదురెగళు, కాడుగళు, గురుగళు, స్వామిగళు* ఇత్యాది): *అందిరు* అన్నది అకారాంతమైన సంబంధ సూచక ప్రాతిపదికలకు, *తాయి* అన్నవానికి పరంలోనూ వస్తుంది. (*అణ్ణందిరు, మావందిరు, తాయందిరు* ఇత్యాది); *కళు* అన్నది *మగు* అన్నవానికి పరంగా వస్తుంది. ఇతర ప్రాతిపదికలపరంలో *అరు* అన్నది వస్తుంది. (*రాజరు, సైనికరు, తంగియరు, సొసెయరు* ఇత్యాది.)[1]

ఇంకొక ఉదాహరణను చూద్దాము. కన్నడంలోని భూతకాలికప్రత్యయము-ఒక ఆకృతి; దానికి *ద్, త్, ట్, క్, ఇద్* అన్న ఐదు వర్ణాకారప్రభేదాలు. ఇంకా ఒక వర్ణాకారప్రభేద మున్నది; అయితే దానివిషయం ప్రస్తుతానికి వద్దు. (వ్యంజనం)-హ్రస్వస్వరం-*డు* అన్న రచనలోని ధాతువులమీద *ట్* అన్నది వస్తుందని ప్రస్తుతానికి చెప్పవచ్చు. (*కాడు-కాట్-ట్-అను* మొదలైనవి): (వ్య)-హ్ర/స్వ-*గు* అన్న రచనలోని ధాతువులమీద *క్* అన్నది వస్తుంది, (*నగు-నక్-క్-అను* ఇత్యాది-); *మరె, నిల్లు సోలు* మొదలైన క్రోడీకృత ధాతువులపరంలో *త్* అన్నది వస్తుంది. (*మరె-మరెత్-అను* మొదలైనవి); ఇకారాంత, ఎకారాంత ధాతువుల (పై పట్టీలో వచ్చేవాటిని వదలి) పరంలోనూ, *హోగు* మొదలైన వర్గంలోని ధాతువుల పరంలోనూ *ద్* అన్నది వస్తుంది. (*ఇళి-ఇళిద్-అను, అగె-అగెద్-అను* ఇత్యాది); ఇతరధాతువుల పరంలోనూ (అంటే

1. తెలుగులో బహూవచన ఆకృతియొక్క వర్ణాకారప్రభేదాలు: -లు, -రు, -ళు, -ళ్లు.

ఉకారాంతమై మూడు ఛందోమాత్రలున్న ధాతువులపరంలో) *ఇద్* అన్నది వస్తుంది. (*నగ్గు-నగ్గ్-ఇద్-అను, మాడు-మాడ్-ఇద్-అను, హారఐ-హారళ్-ఇద్-అను*). ఈ ఉదాహరణలలో చాలాచోట్ల ధాతు-ఆకృతులకు వర్ణాకారప్రభేదా లున్నాయి; అయితే వానివల్ల బాధకమేమీ లేదు.[2]

ఆకృతి అన్నదానికి వర్ణాకార ప్రభేదమన్నదానికీ ఉన్న వ్యత్యాసం ఇప్పటికి స్పష్టమై ఉండవచ్చు. వర్ణాకారప్రభేదమన్నదానికీ, వర్ణాకారమన్నదానికీ ఉన్న వ్యత్యాస మేమిటో చూద్దాము. వర్ణాకారప్రభేదమన్న శబ్దం ఏదైనా ఒక ఆకృతియొక్క వివక్ష ఉన్నప్పుడుమాత్రమే ఉపయోగింపతగ్గది. ఉదాహరణలను చూద్దాము. కన్నడంలోని *అరు, గళు, ద్, ఇద్* అన్నవన్నీ వర్ణాకారాలే. అయితే అవి ఒకే ఆకృతియొక్క వర్ణాకారప్రభేదాలు కావు. *గళు, అరు* అన్నవి బహువచన ఆకృతియొక్క వర్ణాకారప్రభేదాలు; *ద్, ఇద్* అన్నవి భూతకాల-ఆకృతి వర్ణాకారప్రభేదాలు.

వర్ణాకారప్రభేదాలనుగురించి మరికొన్ని వివరాలను తెలిపికొందాము. *కణ్ణీరు, తణ్ణీరు* అన్నశబ్దాలను చూడండి. ఈ శబ్దాల్లో {*నీరు*} అన్న ఆకృతికి *ణీరు* అన్న వర్ణాకారప్రభేద ముంది. నీరు అన్న వర్ణాకారప్రభేదమూ ఇతరత్ర ఉంది. *ణ* కారం తర్వాత *ణీరు* అన్నది, మిగిలినచోట్ల *నీరు* అన్నది వస్తుంది. ఎక్కడ 'ణీరు' వస్తుంది, ఎక్కడ 'నీరు' వస్తుంది అన్నవిషయాన్ని దానికి పూర్వమున్నవర్ణాలే నిర్ధరిస్తాయి.

వ్యావహారిక కన్నడంనుండి ఇంకొక ఉదాహరణను చూద్దాము. *బర్దె* (బారదె) *మాడ్దె* (మాడదె) అన్నశబ్దాలలో *బర్* అన్న వర్ణాకారమూ, *మాడ్* అన్న వర్ణాకారమూ కనిపిస్తాయి. ఇప్పుడు *బన్దె* (బందె), *మాడ్దె* (మాడిదె) అన్నవాటిని చూడండి. *బన్, మాడ్* అన్న వర్ణాకారాలు కనిపిస్తాయి. *బన్, బర్* అన్నవి ఒకే ఆకృతియొక్క వర్ణాకారప్రభేదాలన్నది స్పష్టము. *బర్* అన్నది ఎక్కడ వస్తుంది? *బన్* అన్నది ఎక్కడ వస్తుంది? తర్వాతవచ్చే వర్ణాలసహాయం దొరకడంలేదు. ఎందుకంటె *బన్దె* అన్నదాంట్లోనూ *బర్దె* అన్నదాంట్లోనూ *ద్* అన్న వర్ణసముదాయమే కనిపిస్తుంది. అందువల్ల *బన్* అన్నది భూతకాలిక ప్రత్యయంయొక్క పూర్వంలో వస్తుందని చెప్పాల్సి వస్తుంది.

---

2. తెలుగులో భూతకాలిక ఆకృతియొక్క వర్ణాకారప్రభేదాలు: Æ (చేశాను, వ్రాశాను), ā (వద్దాను, అయ్యాను), i (చూసి, వ్రాసి), in (తినింది, వినింది), ṭi (తింటిని, వింటిని), e (చూచె, కాచె), ti (చూస్తిని, పోస్తిని), iti (చూసితిని, వ్రాసితిని) $\phi$ (తింది, వింది).

*నీరు, జీరు* అన్నవీ పూరకప్రసారంలో ఉన్నాయి; *బర్, బన్* అన్నవీ పూరక ప్రసారంలో ఉన్నాయి. అయితే *నీరు, జీరు* అన్నవాటికి ఉన్ననిమిత్తం వర్ణరూప మైనట్టిది. *బర్, బన్* అన్నవాటికున్ననిమిత్తం ఆకృతిరూపమైనట్టిది. ఈ నిమిత్తభేదం వల్ల వర్ణాకారప్రభేదాలను వర్ణనియంత్రిత వర్ణాకారప్రభేదాలనీ, ఆకృతి నియంత్రిత వర్ణా కారప్రభేదాలని రెండురకాలుగా వింగడించేపద్ధతి ఉంది.

ఒకే ఆకృతికి ఈ రెండువిధాల వర్ణాకారప్రభేదాలూ ఉండడం కద్దు. ఇంతకు ముపపు చూచిన భూతకాలిక ఆకృతియొక్క వర్ణాకారప్రభేదాలను చూద్దాము. *ద్, ఇద్, ట్, క్, త్* అన్నవీటిని రెండువర్గాలుగా వింగడింపవచ్చు. *ఇద్, ట్, క్* అన్నవి ఒక వర్గం. *త్, ద్* అన్నవి ఒక వర్గం. మొదటివర్గంలోని వర్ణాకారప్రభేదా లను వర్ణనియంత్రితములని చెప్పవచ్చు. వాటిప్రసారాన్ని ఇలాగ చూపవచ్చును.

1) ట్—(వ్యంజనం) - హ్రస్వస్వరము - డు అన్న రచనలోని ధాతువులపరంలో
2) క్—(వ్యం) - హ్ర. స్వ - గు అన్న రచనలోని ధాతువులపరంలో
3) ఇద్—ఉకారాంతమూ, మూడు ఛందోమాత్రలున్నట్టి ధాతువులపరంలో

ఈ మూడు వర్ణాకారప్రభేదాల్లో ఒకటి వస్తోంది అని తెలిపితేచాలు, ధాతువు యొక్క వర్ణాలనుచూచే ఆ వచ్చేదేమిటో చెప్పవచ్చు. *కాడు, ఉడు, తాడు* అన్న ధాతు వులపరంలో *ట్* అన్నది వస్తుందని మొదటిదానినుండి అర్థమౌతుంది. *నగు, నిగు* అన్న ధాతువులపరంలో *క్* అన్నది వస్తుందని రెండవదాన్నుండి అర్థమౌతుంది. *మాడు, హారబ* అన్న ధాతువులపరంలో *ఇద్* అన్నది వస్తుందని మూడవదానినుండి అర్థమౌతుంది.

*హోగు, ఆగు* అన్న కొన్నిధాతువుల వైపునుండి *ద్* అన్నదీ పై గుంపులో చేర్చడంలేదు. *ద్* అన్నది బహుళంగా ఎకారాంత, ఇకారాంత ధాతువులపరంలో వస్తుందన్నదాన్ని గమనించాలి.

*త్* అన్న వర్ణాకారప్రభేదం ఎక్కడ వస్తుందన్నదాన్ని తెలుపుటకు *మరె, కలి, సోలు* మొదలైన ధాతువులపట్టీని తయారుచేయాలి.

కన్నడ భూత కాలిక ప్రకృతినే మరింత పీల్చి పిప్పిచేసి, ఇంకా కొన్ని క్రొత్త సంగతులను తెలిసికోడానికి సాధ్యమేమో చూద్దాము. *బందితు, మాడితు* అన్న రెండు

శబ్దాలను చూడండి. *బందితు* అన్నదాంటో *బన్* అన్నది ఒక వర్ణాకారం, *ద్* అన్నది భూతకాలిక వర్ణాకారం. *మాడితు* అన్నదాంట్లో మూడు వర్ణాకారాలుండాలి కదా? మరి కనిపించేవెన్ని? *మాడ్* అన్న వర్ణాకారం, *ఇతు* వర్ణాకారం. ఇక్కడ భూతకాలాన్ని సూచించే వర్ణాకారమే కను మరుగైంది! అయితే *మాడితు* అన్నదానికి భూతకాలార్థమే ఉంది! *బందితు, నింతితు, సోలితు* మొదలైన శబ్దాల సాదృశ్యంనుండి చెప్తున్నప్పుడు *మాడ్, ఇతు* అన్న రెండు వర్ణాకారాలు నడుమ భూతకాలాన్ని సూచించే వర్ణాకారం కోసం చూస్తాము అయితే అక్కడున్నది శూన్యమే. ఈ శూన్యానికి భూతకాలార్థాన్ని ఆరోపించి భూతకాలాకృతికి శూన్యవర్ణాకారప్రభేద మొకదాన్ని పేర్కొనడమే ఇప్పుడు దారి. *ఇద్* అన్న భూతకాలవర్ణాకారప్రభేదాన్ని అపేక్షించే ధాతువులు, ఇకారాంత, ఎకారాంతధాతువులు, 'పోగు', 'అగు' వంటి ధాతువులు—ఇవి పరములో, ప్రథమ పురుష నపుంసకలింగ ఏకవచనంయొక్క ఆకృతి పూర్వములో, ఈ శూన్యవర్ణాకార ప్రభేదము వస్తుందని చెప్పవచ్చు.[1]

ఇలాంటి శూన్యవర్ణాకారప్రభేదాలను ఉపయోగించేటప్పుడు చాలా జాగ్రత్తతో ఉండాలి. అనేకరూపాల సాదృశ్యబలంవల్ల నిరీక్షితమైన వర్ణాకార మొకటి కనుమరుగైతే, అలాటిచోట్లమాత్రమే శూన్యవర్ణాకారప్రభేదాన్ని చెప్పాలి. అర్థపూర్ణతా, వర్ణాభావత ఉన్నప్పుడుమాత్రమే దాన్ని వాడాలి. *మర* అన్నదాంట్లో ఏకవచనాన్ని సూచించే శూన్యవర్ణాకారప్రభేద మున్నదని చెప్పరాదు. కన్నడంలో ఏకవచనాన్ని చూపించడానికి, బహువచనాన్ని చూపడానికున్నట్లు వర్ణరూపమైన ఏ ప్రత్యయమూ లేదు. ఈ దృష్టి నుండి 'శూన్యాకృతి' అన్నది అసంబద్ధమౌతుంది.

శూన్యవర్ణాకార ప్రభేదమన్న ప్రస్తావనవల్ల ఒక కుతూహలకరమైన ప్రశ్న కలుగవచ్చు. వర్ణాల అభావమే ఒక ఆకృతియొక్క అవతారమైతే, ఆకృతియొక్క అభావంవల్లనూ వర్ణాలు అవతరించగలవా? ఉదాహరణకు—*బరెయలి, పడియలి* అన్న శబ్దాలను చూడవచ్చు. *బరె* అన్నది ఒక వర్ణాకారం, *అలి* అన్నది ఇంకొక వర్ణాకారం. మధ్యలోని యకారానికి ఇక్కడ పనేమిటి? ఏమీలేదు. మన పూనుపటివ్యాకరణకారులు ఇలాంటిసందర్భాల్లో *ఆగమ* అన్న శబ్దాన్ని ఉపయోగించారు. ఇప్పటివారు వాటిని రిక్తావతారాలని పిలువవచ్చు! ఈ అవతారాలకు సంవాదులైన ఆకృతులే లేనందువల్ల

---

1. శూన్యవర్ణాకారానికి తింది, వింది అన్నవాటిని తీసికోవచ్చు, అమహద్వాచక ప్ర. పు. ఏకవచనంయొక్క ఆకృతి పూర్వంలోనే, తెలుగులోనూ శూన్యవర్ణాకారము అగుపిస్తుంది.

ఇక్కడ వర్ణాకారమన్న శబ్దము తగదు. అలాగే శూన్యవర్ణాకార ప్రభేదమన్నమాట సరి అనిపించినా, శూన్యవర్ణాకారమన్నమాట విచిత్రంగా ఉంటుంది.

ఆకృతు లవతరించేవిధాన్ని ఇంకోసారి చూద్దాము.

1) ఒక ఆకృతికి ఒకే అవతార ముండవచ్చు. దీన్ని సరళావతారమని పిలువవచ్చు. ఈ సన్నివేశాన్ని ఇలా చిత్రించవచ్చు.




2) ఒక ఆకృతికి ఒకటికంటె ఎక్కువ అవతారాలుండవచ్చు. దీన్ని వివిధావతారమని పిలువవచ్చు.

ఈ సన్నివేశాన్ని ఇలా చిత్రించవచ్చు.




3) ఒక ఆకృతికి కొన్ని సందర్భాల్లో శూన్యావతారం ఉండవచ్చు. ఈ సన్నివేశాన్ని ఇలాగ చిత్రించవచ్చు.



4) ఆకృతి లేకనే కనిపించవచ్చు. దీన్ని రిక్తావతారమని పిలువవచ్చు. ఈ సన్నివేశాన్ని ఇలా చూపవచ్చు.

## ం రిక్తావతారం

ఆకృతినిగురించి ఈ మాత్రం చాలనిపిస్తోంది. ఇక పదమన్నదాన్నిగూర్చి కొన్ని విషయాలు తెలుపుటకు ప్రయత్నిస్తాను.

పదమంటే ఏమిటో తెలిసికోడానికి మునుపు, ఆకృతికీ - పదమన్నదానికీ ఉన్న తేడాలను తెలిసికొందాము. ఒకమాటలో చెప్పాలంటే, పదముల సీమాప్రదేశాలన్నీ, ఆకృతుల సీమాప్రదేశాలు అవుతాయి. అయితే ఆకృతుల సీమాప్రదేశాలన్నీ పదాల సీమాప్రదేశాలు కావడంలేదు ఉదాహరణకు :

**కోతి హణ్ణన్ను** మరదింద బీళిసుతు
(కోతి పండును చెట్టునుండి పడవేసింది)

అన్నవాక్యాన్ని చూడవచ్చు ఈ వాక్యంలో నాలుగుపదాలుమాత్రం ఉన్నాయి. కోతి, హణ్ణన్ను. అన్న 'పదాల' సరిహద్దు, 'ఆకృతుల' సరిహద్దుగాకూడ అవుతోంది. అలాగే పండును, చెట్టునుండి అన్న పదాల సరిహద్దులుకూడ. మరదింద, బీళిసుతు అన్నపదాల సరిహద్దు, ఆకృతుల సరిహద్దు అవుతోంది. అయితే హణ్ణన్ను అన్న దాంట్లోని హణు-అన్ను (పండు-ను) అన్న ఆకృతుల సీమాప్రదేశము, పదాలసీమా ప్రదేశం కాదు. అలాగే మరదింద, బీళిసుతు అన్నవానిలో ఉన్న ఆకృతులయొక్క సీమాప్రదేశం విషయంకూడ. అయితే ఇప్పుడేం జరిగింది ? అంటే పదమన్నది ఆకృతులతో ఏర్పడుతోంది. కొన్నిపదాలలో ఒకే ఆకృతి ఉండవచ్చు. (పై వాక్యంలో 'కోతి' అన్నదాన్ని చూడొచ్చు.) కొన్నింటిలో ఒకటికంటె ఎక్కువ ఉండవచ్చు (మిగిలినవి).

ఇక పదమన్నదాన్నిగూర్చి విపులంగా తెలిసికొందాము. అన్నిభాషలకు అన్వయించేలాగ పదమన్న శబ్దంయొక్క లక్షణాన్ని ఎవరూ ఇదివరకు చెప్పలేదు. ఇక ముందు చెప్పగలిగే అవకాశంకూడ తక్కువే. భాషభాషకూ దానిలక్షణం భిన్నమౌతూ పోతుంది. మన పూర్వవ్యాకరణకర్తలు విభక్త్యంతమైన శబ్దాలనుమాత్రం పదాలని

పిలిచారు. వారు ఈ లక్షణాన్ని తాము వర్ణిస్తున్న భాష దృష్టిమండిమాత్రం చెప్పిఉండ వచ్చు కాబట్టి. విశ్వవ్యాపకమైన లక్షణసూత్రాన్ని వారు రచించారని చెప్పడానికి కాదు. కాని తామిచ్చిన లక్షణం ఇతరభాషలకు అన్వయంకాదని వారు వ్యాఖ్యానించలేదు. అయితే వారు చెప్పినలక్షణం, వాళ్ళు వర్ణించినభాషకే అన్వయమౌతోందా? అన్నదాన్ని పరీక్షించాలి.

విభక్త్యంతమైనశబ్దాలే పదాలు అన్నసూత్రప్రకారం, మరక్కె (చెట్టుకు), మరదింద (చెట్టునుండి), బిద్దను (పడెను), హేళిదను (చెప్పెను) మొదలైన అనేక రూపాలు పదాలౌతాయి ఇది నిజమే. అవ్యయాలను "పదా"లని పిలవాలనో ఏమో, వానికికూడ విభక్తి ప్రత్యయాలనుచేర్చి లోపింపచేశారు. కాలు చాచేటంత పొడవుగా పరుపులేదని కాలునే కత్తిరించుకొన్నట్లయింది! దానికిబదులు అవ్యయాలను పట్టీవేసి, ఇవీ పదాలే అని విడిచిఉంటే సులభంగా ఉండేది. మాడిద, నోడిద, బంద (చేసిన, చూపిన, వచ్చిన) మొదలైన కృదంత విశేషణాలనుకూడ పదాలుగా పిలవాలని మన అంతరాత్మ చెప్పినా, వానిని ఈ లక్షణంప్రకారం పదాలని పిలువలేము. మాడిద కెలస, నోడిద మర, బంద మనుష్య (చేసినపని. చూసిన చెట్టు, వచ్చిన మనిషి) మొదలైన వానిని సమాసాలుగా పిలిచేటంత దూరంపోతేతప్ప. కృదంతవిశేషణాలకు విభక్తి ప్రత్యయాలనుచేర్చి లోపింపజేయడం లేదు. అవ్యయాలకు అనుసరించినవిధానాన్నే, అది కృతకమైనా ఇక్కడా అనుసరించాల్సి వస్తుంది. 'బందమనుష్య' అన్నదాన్ని సమాసమనేది ఎలాగ? 'నెన్నెరాత్రి మైసూరినింద బందమనుష్య' (నిన్నరాత్రి మైసూరి నుండి వచ్చినమనిషి) అన్నదాంట్లో 'మనుష్య' అన్నదానికి 'నెన్నెరాత్రి మైసూరినింద బంద' అన్నది విశేషణం కాదా? అందువల్ల 'బందమనుష్య' అన్నదాన్ని సమాసమనా లంటే, 'నెన్నెరాత్రి మైసూరినింద బంద' అన్నదీ సమాసమే కావాల్సి వస్తుంది. లేకుంటే ఏకదేశాన్వయ వ్యాయామాన్ని చిత్తగించాలి.

అందువల్ల కన్నడంలో విభక్త్యంతశబ్దాలు అవ్యయాలు, పదాలు అని పిలిచి నందువల్ల, వ్యాకరణానికి సంక్షిప్తతను ప్రసాదించే మిగిలినశబ్దాలు - అన్నింటినీ పదాలని పిలువడమే మేలు. ఈ వర్గంలో విభక్త్యంతశబ్దాలు అన్నవిమాత్రం సాధారణీకృత లక్షణంనుండి సిద్ధమౌతాయి; మిగిలినవన్నీ పట్టీలమాత్రమే.

ఈ సందర్భంలో బ్లూమ్‌ఫీల్డ్ అన్న పండితుడు పదమన్నదానికి ఇచ్చిన లక్షణాన్ని పరీక్షించాలి. పదానికి సంబంధించిన నిర్వచనాలన్నిటిలోను ఇది ఎక్కువ ఉపాదేయంగా ఉంది. అతనిప్రకారం పదము (word) అన్నది ఒక minimal free form.

సందర్భవశాత్తు కాని, స్వశక్తివల్లకాని, తానే వాక్యంగా నిలువగలిగే రూపానికి స్వతంత్రరూపమని పేరు. మర, బిద్దను, బేగ, బహళ, అల్లిగె, మనెయింద, నాల్కు-జన, నెన్నె నాను తుముకూరిగె హోగిద్దె (నిన్న నేను తుముకూరికి పోయుంటిని) మొదలైన రూపాలన్నీ వాక్యాలుగా గోచరించగలవు. ఇవన్నీ స్వతంత్రరూపాలు. 'నాల్కు-జన', 'నెన్నె నాను మైసూరిగె హోగిద్దె' అన్నవాటిని మళ్లీ స్వతంత్రరూపాలుగా విభజించవచ్చు. అందువల్ల అవి అవిభాజ్య స్వతంత్రరూపాలు కావు. మరం బిద్దను, బేగ (చెట్టు, పడ్డాడు, వేగం) మొదలైనవాటిని స్వతంత్రరూపాలుగా విభజించడానికి కుదరదు. మనెయింద, అల్లిగె (ఇంటినుండి, అక్కడికి) అన్నవాటిని విభజించడానికి సాధ్యమైనా, అలాటి విభజనవల్ల వచ్చేరూపాలు 'అన్నీ' స్వతంత్రరూపాలు కావు. ఇలాటి అవిభాజ్య స్వతంత్రరూపాలకే 'పదాలు' అని పేరు. ఇక్కడ 'అవిభాజ్యమైన' అన్నశబ్దానికి 'స్వతంత్రరూపాలుగా విభజించడం కుదరని' అని అర్థం.

ఈ లక్షణాన్ని ఏ భాషకు కావాలన్నా అన్వయించవచ్చు. పదాలని పిలువతగ్గ శబ్దాలు దొరకడమేమొ నిశ్చయమే. అయితే పదాలని పిలవాలనిపించే అనేకశబ్దాలను పదాలని పిలవడంలేదు. కన్నడంలో కృదంతవిశేషణాలైన 'బంద', 'మాడిద' మొదలైనవానికి ఇది అన్వయించదు. ఇంగ్లీషులోనూ, సాధారణంగా పదాలని పిలిచే the, a మొదలైనవానికి ఈ లక్షణం అన్వయించదు.

అపరిచితమైనభాషను విశ్లేషిస్తున్నప్పుడు, బ్లూమ్‌ఫీల్డ్‌యొక్క సూత్రంవల్ల జరిగే సహాయం గొప్పదే. విశ్లేషణయొక్క మొదటిఘట్టంలో నమ్మకమైన ఒక ఆధారాన్ని ఈ సూత్రం ఇవ్వవచ్చు. అయితే విశ్లేషణ సాగేకొద్దీ, ప్రకృతభాషయొక్క రచనావిధానం వెలుగులోకి వచ్చేకొద్దీ, పదమన్న శబ్దవ్యాప్తిని విస్తరిస్తూ పోవచ్చు.

అనేకసందర్భాల్లో, అర్థదృష్టినుండి అప్రధానంగా అగుపించే ధ్వనివిశేషాలు, ఏ శబ్దము పదము, ఏదికాదు అన్నదాన్ని నిర్ధరించడానికి సహాయపడుతుంటాయి. ఉదాహరణకు కన్నడంలో సాధారణంగా పదాదిలో 'ఊనిక' వస్తుంది. ఏ శబ్దము పదమో, ఏది కాదో నిర్ధరించడానికి ఈ అంశాన్ని ఉపయోగించవచ్చు. ఉదాహరణకు 'మాడద కెలస' (చేసినపని) అన్నదాంట్లో 'మాడిద' అన్నదాన్ని పదమని పిలువడానికి మా, కె అన్న అక్షరాలమీద వచ్చే ఊనికలు సహాయపడతాయి. రెండు ఊనికల మధ్యగాకాని, ఊనికకూ - మౌనానికి మధ్యగా కాని, ఉన్న వర్ణసముదాయాన్ని పదమని పిలువవచ్చు.

ఇలాగ అవిభాజ్యస్వాతంత్ర్యం, శబ్దాలలో ఉన్నప్రత్యయాలు, ధ్వనివిశేషాలు, లాఘవము మొదలైన ఆధారాలవల్ల ఒక భాషలోనిపదాలను నిర్వచించవచ్చును.

అయితే ఆ భాష మాట్లాడేవారు పదాలుగా పిలిచే శబ్దరూపాలనన్నిటినీ యాంత్రికంగా ఈ ఆధారంవల్ల సిద్ధపరచడంకాని, వారు పదాలుగా పిలువడానికి అంగీకరించని శబ్దాలను యాంత్రికంగా ఈ ఆధారాలవల్ల త్రోసిపుచ్చడంకాని అసాధ్యమే. అంచేతే 'పద' మన్నది భాషావిశ్లేషణకు ఉపయోగపడే కల్పనయే కాదంటూ కొందరు భావిస్తేంచే ఆశ్చర్యం లేదు.

ఇలాటి వివాదాస్పదాలైన పదాలనుండి వాక్యాలను కట్టాలి: ఆ సాహసాన్ని రాబోయే ఉపన్యాసంలో చేద్దాము::

# వర్ణనాత్మక వ్యాకరణ మూలతత్త్వాలు-౩

## వాక్య విశ్లేషణ

ప్రస్తుత ఉపన్యాసంలో వాక్యవిశ్లేషణకు సంబంధించిన కొన్నివిషయాలను స్థూలంగా తెలుపుతాను. కేవలం మూలభూతమైన కొన్నివిషయాల అరుంధతీప్రదర్శనం మాత్రమే సాధ్యమౌతుంది.

ఒకేరకమైన ప్రసారమున్నట్టివీ, ఒకేవిధమైనకార్యాన్ని చేసేటివీ అయిన కొన్ని రూపాలమొత్తానికి 'రూపవర్గ'మన్న పేరిద్దాము. ఉదాహరణకు ఈ రూపాలను చూడండి:

ఒళ్ళెయ హుడుగ (మంచిపిల్లవాడు)
బంద హుడుగ (వచ్చిన పిల్లవాడు)
బరువ హుడుగ (వచ్చే పిల్లవాడు)
నమ్మ హుడుగ (మన పిల్లవాడు)

'ఒళ్ళెయ, బంద, బరువ, నమ్మ' అన్న రూపాలు ఆంతర రచన వేరువేరుగా ఉన్నా, ఈ దశలో అవి చేసేపని ఒకలాంటిదే. వాని ప్రసారమూ ఒకేవిధంగా ఉంది. అందువల్ల ఒళ్ళెయ, బంద, బరువ, నమ్మ మొదలైనవాటి వర్గాన్ని నామవిశేషణ వర్గ మని పిలువవచ్చు. భిన్నభిన్న ఆంతరరచనగల రూపాలను ఒకటిగాచేసే సామాన్యగుణ మొకదాన్ని కనిపెట్టడంవల్ల ఇలాటి వర్గీకరణం ఉపయుక్తమైనదే. ఈ ఉదాహరణాల్లో నామవిశేషణవర్గంయొక్క ప్రతినిధులుగా లెక్కింపగలిగే నాలుగురూపా లున్నాయి. ఇవన్నీ విడివిడియైన పదాలు. ఇందువల్ల ఇలాటి సముదాయాల్లో కనిపించే రూపాలు ప్రతిఒక్కటీ పదమై ఉండాలని భావించకూడదు. ఈ రూపాలను చూడండి :

బహళ ఒళ్ళెయ హుడుగ (చాలా మంచిపిల్లవాడు)
నెన్నె బంద హుడుగ (నిన్న వచ్చిన పిల్లవాడు)
నాళె బరువ హుడుగ (రేపు వచ్చే పిల్లవాడు)
నమ్మ మనెయ హుడుగ (మన ఇంటి పిల్లవాడు)

అంచేత, రూపవర్గాలలో ఉన్న రూపాలు అకృతులై ఉండవచ్చు, పదాలై ఉండవచ్చు, పదసముదాయాలై ఉండవచ్చు. 'బహళ ఒళ్ళెయ హాగూ బహళ బుద్ధి వంతనాద హుడుగ' (చాలా మంచి మరియు చాలా బుద్ధిమంతుడైన పిల్లవాడు) అన్నదాన్నీ, 'మైసూరినింద నెన్న తానే బంద హుడుగ' (మైసూరినుండి నిన్ననే వచ్చిన పిల్లవాడు) అన్నదాన్నీ, 'మూరు కోతిగళు' (మూడు కోతులు) అన్నదాన్నీ చూడవచ్చు. ఇలాగ ప్రసార వినియోగాలదృష్టినుండీ నిర్మితాలైన రూపవర్గాలు వర్ణనకు సంక్షిప్తతను సంతరిస్తాయి.

రెండు, లేక రెంటికంటె ఎక్కువభాగాలుగల రూపాన్ని 'అంగి' లేక 'అంగిరూపము' (Constitute) అనీ, ఆ భాగాలను 'అంగములు' లేక 'అంగరూపాలు' (Constituent) అనీ పిలువవచ్చు. ఈ సూత్రప్రకారం రెంటికన్న ఎక్కువ అకృతులున్న పదముకూడ అంగిరూపమౌతుంది. అయితే వాక్యాలూ, వాక్య విభాగాలూ వివక్షలో ఉంటేగా పదాలూ అంగిరూపాలుగా ఉండవచ్చున్న అంశం అంత ప్రధానంకాదు. 'అవన తలె' (అతని తల) అన్నదాంట్లో రెండు అంగాలున్నాయి; 'అవన' అన్నది ఒకటి, 'తలె' అన్నది ఇంకొకటి. అందువల్ల ఈ దశలో 'అవన తలె' అన్నది అంగిరూపము. 'అవనతలె ఖాళి' అన్నదాంట్లో అవన, తలె, ఖాళి అన్నవి అంగాలు; 'అవను' అన్నదాంట్లో అవను+అ అన్నవి అంగాలు. అవను అన్నదాంట్లో అ+అను అన్నవి అంగాలు; అందువల్ల అవనతలె ఖాళి అన్నదాంటో ఐదు అంగాలున్నాయి. ఈ అంగాలను విభజించడం సాధ్యంకాదు. ఇలాటి అవిభాజ్యమైన అంగాలే అకృతులు. ఇలాటి అంగాలకు 'మూలాంగములు' అన్న పేరివ్వవచ్చు. మూలాంగాలు అంగరూపాలు కాగలవేకాని. అంగిరూపాలు కాలేవు.

ఇప్పుడు అవనతలె ఖాళి అన్నరూపాన్ని ఇంకోసారి చూద్దాము. ఈ రూపంలో అ+అను+అ+తలె+ఖాళి అన్న ఐదు మూలాంగాలు ఉన్నాయని ఇందాకే చూశాము. అవను, అవన అన్నవికూడ ఈ రూపంయొక్క అంగాలే. అవనతలె అన్నదికూడ అంగమే. అయితే తలె ఖాళి అన్నది అంగరూపము కాదు. అందువల్ల 'అవన తలె ఖాళి' అన్నదాంట్లో ఉన్న మూలాంగాలు ఐదే అయినా, అంగాలుమాత్రం ఎనిమిది. అవేవంటే-అ, అను, అ, తలె, ఖాళి, అవను, అవన, అవనతలె అన్నవి. (అంగరూపమన్న శబ్దంయొక్క విశిష్టమైన పారిభాషికార్థాన్ని గుర్తుంచుకోవాలి) వీనిలో అవన అన్నది పదమైనందున, దాన్ని, దానిభాగమైన అవను అన్నదాన్నీ ఈ వివేచననుండి విడిచిపెట్టవచ్చు. అవన తలె అన్న అంగాన్ని చూద్దాము. అవన తలె అన్నదాంట్లో

అవన, తలె అన్న అంగాలు ఉండడంవల్ల అది అంగిరూపంగాకూడ అవుతోంది. అరె! ఇదేమిటి? అవన తలె అన్నదాన్ని అంగరూపమనీ, అంగిరూపమనీ పిలిస్తే ఎలాగ? అన్నప్రశ్న కలుగవచ్చు. ఏది అంగి, ఏది అంగమన్నప్రశ్నలను వేసికోవాలి. అవన తలె అన్నదాన్ని అవన, తలె అని విభజించాక అవన తలె అన్నది అంగి. 'అవనతలె ఖాళి' అన్నదాన్ని 'అవన తలె, ఖాళి' అన్న అంగాలుగా విభాగిస్తే 'అవన తలె' అన్నది అంగము. అందువల్ల విశ్లేషణ ఏ స్థాయిలో ఉందన్నదాన్ని అనుసరించి ఒకేరూపము అంగమూ కావచ్చు. అంగియూ కావచ్చు.

ఇంకొక సన్నివేశాన్ని చూద్దాము. '*అవనతలె ఖాళి*'. (ఇంతవరకు ఉపయోగించని పూర్ణవిరామాన్ని గమనించాలి) అన్నరూపాన్ని చూద్దాము. ఈ రూపాన్ని అంగి అని పిలువవచ్చు. ఈ అంగి, ఇంకొక పెద్ద అంగిరూపంయొక్క అంగము కాలేదు. *అవనతలె ఖాళి ఎందు యారో హేళిదరు* (అతని తల ఖాళీ అని ఎవరో చెప్పారు) అన్న నిర్మాణంలో అవనతలె ఖాళి అన్నది అంగం కావడంలేదా? అని అడుగవచ్చు. మనం మొదట చూపిన *అవనతలె ఖాళి*. అన్నదాంట్లొ పూర్ణవిరామ ముంది. దీంట్లొ లేదు. అందువల్ల ఈ రెండూ ఒకేనిర్మాణం కాదన్నదే సమాధానం ఇదేదో మోసమని మీరు చెప్పవచ్చు. పూర్ణవిరామం వ్రాయడంలో చేసేపనిని కొన్ని ధ్వనివిశేషాలు చేస్తాయి. అవనతలె ఖాళి. అన్నదాంట్లో చివరశ్రుతి తగ్గుతోంది. అవనతలె ఖాళి ఎందు యారో హేళిదరు అన్నదాంట్లోని అవనతలె ఖాళి అన్నదాని చివరలో శ్రుతి తగ్గడంలేదు. అవనతలె ఖాళి ఎందు యారో హేళిదరు అని చెప్పడానికిపోతూ ఖాళి అన్నచోట ఆపితే, ముందు వచ్చేది ఇంకా ఉందని నిరీక్షిస్తాము. అవనతలె ఖాళి. అని చెప్పినిలిపితే వాక్యం ముగిసిందని అర్థమౌతుంది. అందువల్ల 'అవనతలె ఖాళి'. అన్నది, 'అవనతలె ఖాళి ఎందు యారో హేళిదరు' అన్నదాని అంగం కాలేదు. ఇలాగే ఇంకొక పెద్ద అంగియొక్క అంగంకాలేని అంగిరూపమే వాక్యమనిపిస్తుంది.

అంచేత, ఒక చివర అంగిరూపాలు కాలేని మూలాంగాలూ, ఇంకొకచివరలో అంగాలుకాలేని అంగిరూపాలు, మధ్యలో విశ్లేషణాస్థాయికి అనుగుణంగా అంగులూ, అంగాలు కాగలిగినరూపాలు ఉన్నాయన్నట్లు తేలింది.

ఇంకోఅడుగు ముందుకు వేద్దాము. ఒక దృష్టినుండి మూలాంగాలలో స్వారస్యం లేదు. అవి ఇటుకల్లాంటివే. ఇంకొకదృష్టిలోచూస్తే వాక్యాలలోకూడ స్వారస్యం లేదు. అవి కట్టడం ముగిసిన ఇళ్ళలాంటివి - రోమాంచనకారియైన భాగమేదంటే, ఈ రెంటి

మధ్య ఉన్న అంగిరూపాలు, అంగరూపాల అభ్యాసమే. భాషాశాస్త్రానికి తరతరాల సవాళ్ళనువేసే సమస్యలున్నవి ఈ భాగంలో నే.

ఈ భాగంయొక్క విశ్లేషణలో ఇంకొకవిధమైన కల్పనను ఉపయోగించుకోవాల్సి వస్తుంది. ఒక ఉదాహరణవల్ల దీన్ని స్పష్టపరుపవచ్చు. ఈ ఉదాహరణయొక్క చర్చలో మూలాంగాలను పరిగణనకు తీసికోలేదనుకొందాము. *ಅವನು ಒಂದು ಮಾವಿನ ಹಣ್ಣನ್ನು ತಿಂದನು* (అతడొక మామిడిపండును తిన్నాడు) అన్నవాక్యంలో *ಅವನು, ಒಂದು, ಮಾವಿನ, ಹಣ್ಣನ್ನು, ತಿಂದನು, ಒಂದು ಮಾವಿನ ಹಣ್ಣನ್ನು ತಿಂದನು. ಒಂದು ಮಾವಿನ ಹಣ್ಣನ್ನು, ಒಂದು ಮಾವಿನ ಹಣ್ಣು, ಅನ್ನು, ಮಾವಿನ ಹಣ್ಣು* అన్న పది అంగాలు ఉన్నాయి. అయితే ఈ వాక్యానికి నేరుగా సంబంధించిన అంగాలు ఏవి? అవను అన్నదొకటి, ఒందు మావిన హణ్ణన్ను తిందను అన్నది ఇంకొకటి. ఏ అంగాలనుండి అంగిరూపము నేరుగా రచితమైందో, ఆ అంగాలకు సాక్షాదంగాలు అన్న పేరివ్వవచ్చు. అందువల్ల ఈ వాక్యంయొక్క విభజనను ఇలా చూపవచ్చు.

అవను ఒందు మావిన హణ్ణన్ను తిందను

5

4

3

2

1

(1) అవను ఒందు మావిన హణ్ణన్ను తిందను - అన్నదాన్ని మొదట అవను, ఒందు మావిన హణ్ణన్ను తిందను అన్న సాక్షాదంగాలుగా విభాగించవచ్చు. రామను। బందను, అవను। మనెగె హోదను, నమ్మ మగు। మంచదింద కెళగె బిద్దితు (రాముడు। వచ్చాడు, అతడు। ఇంటికి పోయాడు, మా బిడ్డ। మంచంనుండి క్రిందకు పడ్డది) అన్న రీతిలోని అనేక వాక్యాలన్నింటికీ ఒకే రచన అన్నది దీనివల్ల అర్థమౌతుంది.

(2) ఒందు మావిన హణ్ణన్ను తిందను అన్నది వాక్యంయొక్క అంగమే. అయితే, వాక్యంయొక్క సాక్షాదంగం కాదు. అయితే అది విమ్నస్థాయిలో అంగికూడ అవుతుంది. అందువల్లనే దాన్ని 'ఒందు మావిన హణ్ణన్ను, తిందను' అన్న సాక్షాదంగాలుగా విభజించినది.

(3) ఒందు మావిన హణన్ను అన్నదికూడ వాక్యంయొక్క అంగమే, సాక్షాదంగం కాదు. అది విమ్నస్థాయిలో అంగిగాకూడ అవుతోంది. అందువల్ల దాన్ని 'ఒందు మావిన హణ్ణు, అన్ను' అన్న సాక్షాదంగాలుగా విభజించవచ్చు. ('అన్ను' అన్నది పదం కాదన్నదానికి, తొలి ఉపన్యాసంలోని పదసిద్ధి, వాక్యసిద్ధుల సరిహద్దు గురించి చెప్పినమాటలను జ్ఞప్తికి తెచ్చుకోండి.)

(4) 'ఒందు మావిన' అన్నదీ వాక్యాంగమే; అయితే సాక్షాదంగం కాదు. అది విమ్నస్థాయిలో అంగికూడ అవుతుంది. అందువల్ల దాన్ని 'ఒందు । మావిన హణ్ణు' అన్న సాక్షాదంగాలుగా విభజించవచ్చు.

(5) మావిన హణ్ణు అన్నదీ వాక్యాంగమే. అయితే అది వాక్యంయొక్క సాక్షాదంగము కాదు. అది క్రిందిమెట్టులో అంగికూడ అవుతుంది. అందువల్ల దాన్ని 'మావిన । హణ్ణు' అన్న సాక్షాదంగాలుగా విభజించవచ్చు.

ఇక్కడికి వాక్యవిభజన ముగిసింది. అయితే ఒకప్రశ్న కలుగవచ్చు. 'సాక్షాదంగం' యొక్కకల్పన (Concept) వాక్యవిభజన అంటే ఏమిటో చూపవచ్చు. ఆ కల్పననుండి వాక్యాన్ని నిర్మించేది ఎలాగ అన్నది ఆ ప్రశ్న. ఇదివరకు చెప్పినదాన్ని తారుమారుచేస్తే సమాధానం లభిస్తుంది. అదే ఈ క్రింద చూపబడింది.

అవను ఒందు మావిన హణ్ణన్ను తిందను

1

2

3

4

5

(1) మొదట మావిన | హణ్ణు అన్న సాక్షాదంగాలనుండి మావిన హణ్ణు అన్న అంగి లభిస్తుంది. మరదకుర్చి. గాజినబళె (కఱ్ఱకుర్చీ, గాజుకంకణం) మొదలైన అనేక రూపాలు ఇలాగే సిద్ధిస్తాయి.

(2) 'ఒందు | మావిన హణ్ణు' అన్న సాక్షాదంగాలనుండి ఒందు మావిన హణ్ణు అన్న అంగి లభిస్తుంది. ఒందు మరద కుర్చి. ఒందు గాజినబళె మొ॥న అనేక రూపాలు ఇలా సిద్ధిస్తాయి.

(3) 'ఒందు మావిన హణ్ణు | అన్ను' అన్న సాక్షాదంగాలనుండి ఒందు మావిన హణ్ణన్ను అన్న అంగి లభిస్తుంది.

(4) 'ఒందు మావిన హణ్ణన్ను | తిందను' అన్న సాక్షాదంగాలనుండి ఒందు మావిన హణ్ణన్ను తిందను అన్న అంగి లభిస్తుంది. ఒందు మరదకుర్చియన్ను మాడిదను, ఒందు గాజిన బళెయన్ను ఒడెదను అన్న అనేకరూపాలు ఇలాగే సిద్ధిస్తాయి.

(5) 'అవను | ఒందు మావిన హణ్ణన్ను తిందను' అన్న సాక్షాదంగాలనుండి అవను ఒందు మావిన హణ్ణన్ను తిందను అన్న అంగికూడ లభిస్తుంది. 'బడగియు ఒందు మరద కుర్చియన్ను మాడిదను, అవను ఒందు గాజిన బళెయన్ను ఒడెదను' (వడ్రంగి ఒక కఱ్ఱకుర్చీని చేశాడు, అతడు ఒక గాజుకంకణాన్ని పగులగొట్టాడు) మొదలైన అనేకరూపాలు సిద్ధిస్తాయి.

(6) ఈ రూపాలకు వాక్యవిశిష్టమైన శ్రుతి వ్యత్యాసాలను చేర్చితే వాక్యాలు లభిస్తాయి.

ఆరవవాక్యంనుండి వ్యక్తమయ్యే అంశమిది: విశ్లేషణకాలంలో శ్రుతి వ్యత్యాసాలను విడదీయడం మొదటిమెట్టు. ఉద్దేశ్యపూర్వకంగానే దీన్ని ఇంతకుముందు వివరించలేదు.

కన్నడంలోని ఏ వాక్యాన్ని తీసికొన్నా ఇలాటి మెట్లుమెట్లుగా రచన కనపడుతుంది.

సాక్షాదంగాలకల్పన ఎంతటి ఫలప్రదమైనదన్నదాన్ని మళ్ళీ కొన్ని ఉదాహరణల సహాయంవల్ల చూపవచ్చు. మొదట రెండురూపాలను చూద్దాము.

సులిద బాళెయ హణ్ణు (ఒలిచిన అరటిపండు)
కళెద సిగురిన కబ్బు (తరగిన గడల చెఱకు)*

---

* ఈ మాట తెలుగులో పొసగదు. అంచేత 'విరిసిన పూలతోట' అన్నమాటను ఉదాహరణగా తీసికొందాము. ఇది రచయిత వివరించే రూపనిర్మాణానికి అనుగుణంగాకూడా ఉంటుంది.

ఈ రెండురూపాల్లోనూ మూడు మూడు పదాలున్నాయి. మొదటిస్థానంలో ధాతుజ విశేషణమూ, రెండవస్థానంలో షష్ఠీవిభక్తిరూపమూ, మూడవస్థానంలో ప్రాతిపదిక - లేక - ప్రథమావిభక్తిరూపము వచ్చాయి. ఈ రూపాలను ఇలా వర్ణించడం వల్ల, ఈ రూపాలనూ, ఇదే రచనగల ఇతరరూపాలను వర్ణించినట్లయింది. అయితే ఇలా వర్ణించి ముగించడం సాధ్యమయ్యేకార్యమా? ఒక అంగిలో ఇరవైపదా లుండవచ్చు, ముప్పయి ఉండవచ్చు, నూరుండవచ్చు. ప్రతి అంగిరూపాన్ని పదాలు, లేక రూపవర్గాల అనుపూర్వికగా వర్ణించేది సాధ్యంకాదివని. అంచేత, ఇలాటి వర్ణనకూడ బాళెయహణ్ణు, మాడిదకెలస (చేసినపని) మొదలైన రెండే అంగరూపాలున్న అంగిరూపాలకే అనివార్యమైనా, రెంటికంటె ఎక్కువ అంగాలున్న అంగిరూపాలను ఇలా వర్ణించడం శ్రమదాయకమౌతుంది. శ్రమదాయకమని ఒక మార్గాన్ని అనుసరించకుండానే విడిచిపుచ్చితే సోమరితనమన్న ఆరోపణ వస్తుంది. అందువల్ల శ్రమదాయకమన్న ఆక్షేపణకంటె బలమైన ఇంకో ఆక్షేపణను సూచించవచ్చు.

'సులిద బాళెయ హణ్ణు' అన్నరూపాన్ని చూశాక ఒలిచినది దేనిని? అరటినా పండునా? అన్నప్రశ్నను వేసికొంటే అరటి అన్నది పండు అన్నదానికి విశేషణమని ఒలిచిన అన్నది అరటిపండు అన్నదానికి విశేషణమనీ అర్థమౌతుంది. అంచేత 'సులిద బాళెయ హణ్ణు' అన్నదాని నిర్మాణం ఇలాగుంటుంది.

సులిద బాళెయ హణ్ణు



ఇప్పుడు 'కళెద పిగురిన కబ్బు' అన్నదాన్ని చూద్దాము.* ఇక్కడా అలాటి ప్రశ్నలే వేసికొందాము. తరిగినది దేనివి? గడనా? లేక చెఱకునా? తరిగిన అన్నది గడ అన్నదానికి విశేషణమనీ, 'కళెద పిగురిన' అన్నది 'కబ్బు' అన్నదానికి విశేషణమనీ అర్థమౌతుంది. అందువల్ల ఈ రూపంయొక్క నిర్మాణం ఇలాగుంటుందని చూపవచ్చు.

---

* 'విరిసిన పూలతోట' అన్న తెలుగు ఉదాహరణంలో ఇలాటి నిర్మాణమే. విరిసిన వ్నది పూల అన్నదానికి విశేషణం. విరిసినపూల అన్నది తోట అన్నదానికి విశేషణం.




'సులిద బాశెయ హణ్ణు', 'కశెద పిగురిన కబ్బు' అన్న రూపాలను ధాతుజ-విశేషణం+షష్ఠీవిభక్తిరూపం+ప్రాతిపదిక అన్న ఆనుపూర్వి అని వర్ణిస్తే, పైకి ఒకే ఆనుపూర్వి ఉన్నప్పటికీ లోన రెండు రచనలను పొందుపరచుకొని ఉన్న ఈ రూపాలను సరిగా వర్ణించినట్లు కాదు. ఈ ఒకే ఆనుపూర్వి వెనుక అణగి ఉన్న రెండు రచనలను ఇలా చూపవచ్చు.




ఇలాటి రెండు విధాల అంతరరచన గలిగి ఉన్నప్పటికీ, ఒకే బాహిరమైన ఆనుపూర్వి గల అంగిరూపాలనుండి సాధారణంగా సందర్భబలంవల్ల సందిగ్ధత తలెత్తదు. అయితే ఒక్కొక్కసారి ఆనుపూర్విలో ఉన్న రూపవర్గాల ప్రతినిధులు రెండూ అంతర

రచనల్లోనూ ఒక్కటిగానే ఉండవచ్చు. అప్పుడు సందిగ్ధత ఏర్పడే అవకాశముంది. 'బాగిద మరద కొంబె' (వాలిన చెట్టుకొమ్మ) అన్నదాన్ని 'సులిద బాళెయ హణ్ణు' అన్నదానిలాగే విభజిస్తే, వాలినది చెట్టుకొమ్మ కావి, చెట్టు కాదన్నది అర్థమౌతుంది. 'బాగిద మరద కొంబె' అన్నదాన్ని 'కళెద సిగురిన కబ్బు' లాగ విభజిస్తే, వాలినది చెట్టు, చెట్టుకొమ్మ కాదని తేలుతుంది.

ఈ నిరూపణవల్ల సాక్షాదంగాల కల్పన ఎంత ఫలప్రదమైందో అర్థమౌతుంది. అంతేకాక ఈ ఉపన్యాస ఆరంభంలోని రూపవర్గాలకు సంబంధం ఏర్పడినట్లు అవుతుంది.

ఇక ఏకాంగిత్వమంటే ఏమిటన్నదాన్ని తెలిసికొందాము. రెండురూపాలు ఒక అంగియొక్క సాక్షాదంగాలు అయిఉంటే, ఆ రెండురూపాలకు ఏకాంగిత్వసంబంధ ముందని చెప్పవచ్చు. ఒక ఉదాహరణను చూద్దాము :

అవను బహళ ఒళ్ళెయ హుడుగ (అతడు చాలా మంచి అబ్బాయి).

'అవను' అన్నది ఒక రూపం; 'బహళ ఒళ్ళెయ హుడుగ' అన్నది ఇంకొక రూపం. ఈ రెండూ పైని అంగియొక్క సాక్షాదంగాలు; ఆ రెంటికీ ఏకాంగిత్వసంబంధ ముందని చెప్పవచ్చు. 'అవను' అన్నది ఒక రూపం; 'ఒళ్ళెయ హుడుగ' అన్నది ఇంకొక రూపం. ఈ రెండూ పై అంగియొక్క సాక్షాదంగాలు కావు; ఈ రెంటికీ ఏకాంగిత్వసంబంధం లేదనిచెప్పవచ్చు. 'అవను ఒళ్ళెయ హుడుగ' అన్న అంగిలో ఈ రెంటికీ ఏకాంగిత్వసంబంధముంది. అయితే అది వేరేమాట. 'అవను' అన్నది ఒక రూపం; 'బహళ' అన్నది ఇంకొకరూపం. అయితే 'అవను' మరియు 'బహళ' అన్నది మీదివాక్యంయొక్క సాక్షాదంగాలే అన్నమాటను అలాగుంచి, 'అవను బహళ' అన్నది అంగమూ కాదు, అంగికూడ కాదన్నదాన్ని గమనిస్తే, ఈ రెంటికీ ఏకాంగిత్వసంబంధం ఉందా ? అన్న ప్రశ్నే కలుగదు.

రెండువిధాల ఏకాంగిత్వసంబంధా లున్నాయి. 'మరద కుర్చి' (కట్టె కుర్చీ) అన్నదాన్ని చూద్దాము. ఇక్కడ 'మరద', 'కుర్చి' అన్నవాటికి ఏకాంగిత్వసంబంధం ఉందని చెప్పవచ్చు. ఇక్కడ స్వారస్యమేమిటంటే, కుర్చి అన్నది ఏ రూపవర్గానికి చెందుతుందో, అదే రూపవర్గానికి 'మరద కుర్చి' అన్నదీ చేరుతుంది. సాక్షాదంగాల్లో ఒకటి ఏ రూపవర్గానికి చేరుతుందో, అదే రూపవర్గానికి అంగికూడ చేరితే అగుపించే ఏకాంగిత్వసంబంధముంది. జోరుగా పరిగెత్తాడు, వేగంగా వచ్చాడు, చేసినపని, ఉన్న ఇల్లు—ఇవన్నీ ఇలాటి ఏకాంగిత్వసంబంధ మున్నట్టి ఉదాహరణలే, ఇలాటి సంద

ర్భాల్లో అంగి ఏ సాక్షాదంగరూపవర్గానికి చేరుతుందో, ఆ సాక్షాదంగాన్ని విశేష్యమనీ, ఇంకొక సాక్షాదంగాన్ని విశేషణమనీ పిలువవచ్చు. కఱ్ఱకుర్చి, జోరుగా పరిగెత్తాడు, వేగంగా వచ్చాడు, చేసినపని, ఉన్న ఇల్లు—మొదలైన అంగిరూపాలు, కుర్చి, పరుగెత్తాడు, వచ్చాడు, పని, ఇల్లు - అన్న సాక్షాదంగాల రూపవర్గాన్ని క్రమంగా చేర్తాయి. అందువల్ల ఈ అంగిరూపాలలో కుర్చి, పరుగెత్తాడు, వచ్చాడు, పని, ఇల్లు - అన్నవి విశేష్యాలు; కఱ్ఱ (యొక్క), జోరుగా, వేగంగా, చేసిన, ఉన్న - అన్నవి విశేషణాలు.

రెండవవిధమైన ఏకాంగిత్వసంబంధం దీనికి విరుద్ధమైనట్టిది. 'అవను బందను' అన్న అంగికి 'అవను' మరియు 'బందను' అన్నవి సాక్షాదంగాలు. 'అవను బందను' అన్న అంగి, 'అవను' అన్నదాని రూపవర్గానికీ చేరడంలేదు, 'బందను' అన్నదాని రూపవర్గానికీ చేరడం లేదు.

ఏ భాషైనాకాని, దానిలో ఆ రెండురకాల ఏకాంగిత్వసంబంధాలు అగుపిస్తాయి. ఏ భాషయొక్క వాక్యమైనాకాని, అందులో పదసముదాయము, వాక్యవిశిష్టమైన శ్రుతి వ్యత్యాసాలు అన్న సాక్షాదంగాలుగా విభజింపవలసినందువల్ల, వాక్యాలన్నీ రెండవ రకపు ఏకాంగిత్వసంబంధాన్ని కలిగిఉన్న సాక్షాదంగాలనుండి ఏర్పడుతున్నాయని చెప్ప వచ్చేమో ; అయితే రెండవవిధపు ఏకాంగిత్వసంబంధాన్నిచూపే సాక్షాదంగాలనుండి ఏర్పడే అంగిరూపాలన్నీ వాక్యాలు కాలేవు. 'అవన మనె' మరియు 'గె' అన్న సాక్షాదంగాలనుండి లభించే 'అవన మనెగె' (అతని ఇంటికి) అన్నది అన్ని సందర్భాలలోనూ వాక్యం కాలేదు.

వాక్యవిశ్లేషణకు సంబంధించి ఈమాత్రం చాలనిపిస్తోంది. ఇప్పుడు వాక్య విశ్లేషణలో భాషాశాస్త్రవేత్తలు అద్భుతమైన ప్రగతిని సాధిస్తున్నారు. క్రొత్తక్రొత్త సంఘాలు పుట్టుకొచ్చాయి. అవి సాధించేఫలితాలుకూడ మహనీయమైనవి. సాక్షాదంగ విశ్లేషణ కంటె చక్కటి పద్ధతులు ప్రయోగానికి వచ్చాయి. అంచేత ఈ ఉపన్యాసంలో చెప్పిన మాటలే చివరి మాటలని మీరు భావించకూడదని వేడుకొంటూ ఈ ఉపన్యాసమాలను ముగిస్తున్నాను.

---

ఈ ఉపన్యాసంలోని కొన్నిభాగాలను సిద్ధపరుస్తున్నపుడు, క్రింద ఉదహరించిన రచనల నుండి నాకు చాలా సహాయం లభించింది.

W. Haas, 'Linguistic Relevance' In memory of J. R. Firth, PP. 116-147, Longmans, 1966.

C. F. Hockett, 'The Tongue is a fire', a chapter in Man's place in Nature.

S. M. Lamb, 'Outline of Stratificational Grammer', George town University Press, 1966.

S. M. Lamb, 'Epilegomena to a theory of Language', Romance Philology, 19 4. 531-573 (1966)

—రచయిత.

# పారిభాషిక శబ్దాలు

ఈ మూడు ఉపన్యాసాలలోనూ ఉపయోగించిన ముఖ్య పారిభాషికశబ్దాలు వాటికి సమానమైన ఆంగ్లపదాలు ఈ క్రింద ఇవ్వబడ్డవి.

| | |
|---|---|
| అఘోషము | **Voiceless** |
| అనునాసికము | **Nasal** |
| అవతారము | **Realisation** |
| అవిభాజ్యము | **Unsegmentable, Smallest, Minimal** |
| అంగము, అంగరూపము | **Constituent** |
| అంగి లేక అంగిరూపము | **Constitute** |
| ఆకృతి | **Morpheme** |
| ఆకృతి నియంత్రితం | **Morphemically Conditioned** |
| ఆఘాతము, ఊనిక | **Stress** |
| అనుపూర్విత | **Order, Sequence** |
| ఆంశిక సామ్యత | **Partial similarity** |
| ఉభయ పరిసరం | **Preceding and Following Environment** |
| ఏకాంగిత్వ సంబంధము | **Constructional Relation** |
| ఓష్ఠ్యము | **Bilabial** |
| ఓష్ఠ్యభిన్నత | **Non-Labial** |
| గ్రంథి | **Bundle** |
| ఘటిక | **Element** |
| ఘోష | **Voiced** |
| తాడితము | **Flap** |
| తాలవ్యము | **Palatal** |
| దంత్యము | **Dental** |
| ద్వైవిధ్యత | **Duality** |
| ధ్వని | **Speech Sound** |
| ధ్వనిప్రభేదము | **Allophone** |

| | |
|---|---|
| ధ్వన్యంగాలు | Organs of Speech |
| ధ్వనివ్యవస్థ | Sound System |
| ధ్వనిశాస్త్రము | Phonetics |
| ధ్వనిశాస్త్రజ్ఞుడు | Phonetician |
| నాసికాద్వారము | Nasal Passage |
| నాసిక్యత | Nasality |
| నిఘంటువు | Lexicon |
| నిమిత్తత | Conditioning |
| నియమము | Rule |
| నియోగము | Function |
| పదము | Word |
| పదసిద్ధి | Word-Formation |
| పరపరిసరము | Following Environment |
| పరస్పర వ్యావర్తక పరిసరాలు | Mutually Exclusive Environments |
| పరిసరము | Environment |
| పర్యాయము | Alternative |
| ప్రత్యయం | Suffix |
| ప్రసారము | Distribution |
| పార్శ్వికము | Lateral |
| పూరక ప్రసారం | Complementary Distribution |
| పూర్వ పరిసరం | Preceding Environment |
| మూర్ధన్యం | Domal, Cacuminal |
| మూర్ధన్యభిన్నత | Non-Cacuminal |
| మూలఘటిక | Unit |
| మూలాంగము | Ultimate Constituent |
| కంఠ్యము, మృదుతాలవ్యము | Velar |
| మృదుతాలువు | Soft Palate, Velum |
| మౌనము | Silence, Pause |
| మౌలికాంశము | Distinctive Feature |
| యాదృచ్ఛికము | Arbitrary |
| యుగ్మము | Pair |
| రచన, నిర్మాణం | Structure |
| రిక్తావతారము | Empty Realisation |

| | |
|---|---|
| రూపము | Form |
| రూపవర్గం | Form Class |
| లాఘవము | Economy |
| వర్ణము | Phoneme |
| వర్ణనాత్మక | Descriptive |
| వర్ణనియంత్రిత | Phonemically Conditioned |
| వర్ణశాస్త్రము | Phonemics |
| వర్ణశాస్త్రజ్ఞుడు | Phonemicist |
| వర్ణసముదాయం | Sequence of Phonemes |
| వర్ణాకారం | Phonemic Shape, Morph |
| వర్ణాకారప్రభేదం | Allomorph |
| వర్త్స్యము | Alveolar |
| వ్యవస్థ | System |
| వ్యవహార వ్యవస్థ | Communication System |
| వ్యంజనం | Consonant |
| వాక్యము | Sentence |
| వాక్యసిద్ధి | Sentence Formation |
| విభాజ్య | Segmentable |
| విరామము | Pause |
| విరోధప్రసారం | Contrastive Distribution |
| వివిధావతారం | Multiple Realisation |
| విశేషణం | Attribute |
| విశేష్య | Head |
| విశ్లేషణ | Analysis |
| వైకల్పిక ప్రసారం | Free Variation |
| సమగ్రత | Completeness |
| సమర్పకత | Appropriateness |
| సరళత | Simplicity |
| సరళావతారం | Unique Realisation |
| స్పర్శము | Stop |
| స్వతంత్రరూపము | Free Form |
| స్వరము | Vowel |
| స్వరతంతువులు | Vocal Chords |
| సంభావనీయము | To be Predicted |

| | |
|---|---|
| సాక్షదంగం | **Immediate Constituent** |
| సాధారణీకరణం | **Abstraction** |
| సాపేక్షకము | **Relative** |
| సామాన్యీకరణం | **Generalisation** |
| శూన్యవర్ణాకార ప్రభేదం | **Zero Allomorph** |
| శూన్యావతారం | **Zero Realisation** |

# కన్నడ తెలుగు శబ్దకోశం

అక్క = అక్క
అగు = అగుట
ఆడు = ఆడుట, మేక
ఆణె = ఒట్టు, ఆన
ఆనె = ఏనుగు
ఆమె = తాబేలు
అమ్మ = అమ్మ
అర = అర
ఆరు = ఆరు
ఆలె = గానుగ
అల్లిగె = అక్కడికి
అవను = అతడు
ఇంద = నుండి
ఉడు = కట్టుకొనుట
ఒళ్ళెయ = మంచి
ఓదు = చదువుట
కడ్డి = బెత్తము
కాడు = అడవి
కబ్బు = చెరకు
కల = నేర్చు
కళెద = పోయిన, గడచిన, తరిగిన
కణ్ణీరు = కన్నీరు
కాలు = కాలు
కాళు = ధాన్యము, గింజలు
కాణు = చూచు
కురి = గొఱ్ఱె
కుడియలి = త్రాగుడి
కుడి = త్రాగు
కుదురె = గుఱ్ఱము
కేళు = అడుగుట
కెలస = పని

కొడు = ఇచ్చు

కోతి = కోతి

గిడ = మొక్క

గురి = గురి

చిక్క = చిన్న

దుబ్బు = మూపురం

దేగె = డేగ

డొళ్ళు = డొల్ల

తంగి = చెల్లెలు

తణ్ణీరు = చల్లని నీరు

తురి = తురిమి

తొడు = తొడుగుకొను

దొడ్డ = పెద్ద

నగు = నగుట

నల్లె = ప్రేయసి

నాయి = కుక్క

నాను = నేను

నిల్లు = నిలచు

నింతితు = నిలిచింది

నుగ్గు = చొచ్చు

నురి = నూరి

నెన్నె = నిన్న

నోడిద = చూసిన

వంచె = వంచ

పురి = మరమరాలు, బొరుగులు

పేఱు = చెప్పు (పాత కన్నడరూపం).

బరె = వ్రాయు

బరెదను = వ్రాసెను

బందను = వచ్చాడు

బర్దె (బారదె) = రానిదె

బందె = వచ్చాను

బందితు = వచ్చింది

బరెయలి = వ్రాయనిమ్ము

బాళెయ = అరటి

బాడు = వాడు
బిడు = విడచు
బీళు = పడుట
బీఴు = పడుట (పాత కన్నడరూపం)
బేగి = వేగం
మరి = పిల్ల
మనె = ఇల్లు
మర = చెట్టు
మందె = మంద
మలె = కొండ
మాడు = చేయు
మాడ్దె (మాడదె) = చెయ్యనిదె
మాడిద = చేసిన
మాడిదను = చేశాడు
మిగు = మిగులు
మురి = విరిచి
మొర = చాట
రుబ్బు = రుబ్బు
లల్లె = పరదాగా ఆడవాళ్లు చెప్పుకొనే కబుర్లు, లొల్లాయి కబుర్లు
సంజె = సంజ
సంతె = సంత
సిగు = దొరకు
సుంక = సుంకము
సురి = పోసి
సోలు = ఓడుట
సోలితు = ఓడింది
సులిద = ఒలిచిన
హణ్ణు = పండు
హురి = పురి (పురిబెట్టుట)
హుడుగరు = పిల్లలు
హెండ = కల్లు
హొరళు = మార్పు
హోగు = పోవు

# ధ్వని శాస్త్రము

[డా॥ బీశగిరిగారు తమ ఉపన్యాసమాలలో ధ్వనినిగురించి విశేషంగా చర్చించడానికి వీలులేకపోయింది కాబట్టి, ఇక్కడ ధ్వనినిగురించి కాస్త సంక్షిప్తంగానైనాసరే, వివరించేబాధ్యత ఉందనుకొంటాను. వారు వర్ణత్వాన్నిగురించి చెపుతున్నప్పుడు, ధ్వనిశాస్త్రసంబంధమైన కొన్ని ముఖ్య పారిభాషికపదాలను వాడారు. భాషాశాస్త్రానికి అపరిచితులైనవాళ్ళకు, ఇబ్బందిలేకుండా, సంక్షిప్తంగా మాత్రమే ఇక్కడ ధ్వనిశాస్త్రాన్ని వివరిస్తున్నాను. —అనువాదకుడు.]

ధ్వనిశాస్త్రంలో ప్రధానంగా మూడు విభాగాలున్నాయి.

1. భౌతికధ్వని శాస్త్రము (acoustic Phonetics): మాటాడేటప్పుడు పుట్టే ధ్వనితరంగాలు, వాయుమూలకంగా వానిప్రసారం - మీద కేంద్రీకృతమయ్యే శాస్త్రీయ పరిశీలనను భౌతిక ధ్వనిశాస్త్రమని పిలుస్తారు. ఇది భౌతికశాస్త్రం (Physics) తో అను బంధమైన భాగం.

2. శ్రవణాత్మక (లేక) శ్రవణధ్వని శాస్త్రము (auditory Phonetics): శ్రవణేంద్రియాలనిర్మాణం, భాషను గ్రహించేవిధానం, ఆ విధానంలో ఉన్న మానసిక వ్యాపారం మొదలుగా శ్రోతభాషను గ్రహించడంలోని విధానపరిశీలనను శ్రవణధ్వని శాస్త్రమని అంటారు.

3. ఆంగిక ధ్వనిశాస్త్రం (articulatory Phonetics): భాషావివేచనలో, సామాన్యంగా, చాలా ప్రాధాన్యాన్ని పొందేభాగం ఇది. భాషాప్రయోగంలో ధ్వన్యంగాలప్రాధాన్యం. తన్మూలంగా వివిధధ్వనుల ఉత్పత్తిని పరిశీలించేశాస్త్రాన్ని ఆంగిక ధ్వనిశాస్త్రమని అంటారు. ప్రస్తుతం గమనీయమైంది ఇదే.

శ్వాసకోశాలనుండి వెలికివచ్చే గాలిని ధ్వన్యంగాలమూలంగా అక్కడక్కడ ఆటంకపరచడంవల్లనో, లేక భిన్నకార్యాలవల్ల మార్పులు పొందించడంవల్లనో ధ్వనుల ఉత్పత్తి జరుగుతుంది. పెదవులు, తాలువు, నాసిక, నాలుక మొదలైనవి ధ్వన్యంగాలని పిలువబడుతాయి. వీనికి తినడం, ఊపిరి పీల్చడంవంటి ప్రాథమికకార్యా లున్నాయి. ధ్వన్యుత్పాదన అన్నది వీనికి అధికంగాఉన్న కార్యం - స్వరపేటిక సహాయంతో ఈ ధ్వన్యుత్పాదన జరుగుతోంది.

ఒకచివర శ్వాసకోశాలు, ఇంకొకచివర పెదవులో, నాసికారంధ్రాలో ఉండగా, శ్వాసకోశాలనుండి వెలికి వస్తున్న వాయుమార్గాన్ని బహిర్వర్త వాయుమార్గము (eggressive airstream) అని పిలువవచ్చు. అలాగే పెదవులనుండీనో, నాసికా రంధ్రాలనుండీనో శ్వాసకోశాలదాకా లోనికి పోతున్న వాయుమార్గాన్ని అంతర్వర్త వాయుమార్గము (ingressive airstream) అని పిలువవచ్చు. రెండు వాయుమార్గాల్లోనూ, ధ్వన్యంగాలమూలంగా అనేకధ్వనులను ఉత్పన్నం చేయవచ్చు. కాని, సామాన్యంగా ప్రపంచంలోని అన్నిభాషల్లోనూ, ఏ కొన్నింటిలోనోతప్ప, బహిర్వర్తవాయు మార్గంలో వెలువడే ధ్వనులే వాడబడుతున్నాయి.

ధ్వన్యంగాలను స్థాన, కరణములని రెండుగా విభజించవచ్చు. 1. ధ్వనిమార్గం యొక్క పై భాగంలో 'స్థిరాంగము' లుంటాయి. ఈ స్థిరాంగాలవద్ద వాయుమార్గానికి ఆటంకం కలిగి, ధ్వన్యుత్పాదనకు అవకాశం ఏర్పడుతున్నది కాబట్టి, వీటిని ఉచ్చారణా స్థానాలు లేక ధ్వనిస్థానాలు (Points of articulation) అని పిలుస్తారు. పై పెదవి, పై పళ్ళవరస, దానివెనుకే ఉన్న వర్త్సభాగం, ఆ తర్వాతగా ఉన్న కఠినభాగం - మూర్ధన్యస్థానం, ఆ వెనుకగాఉన్న మృదువైనభాగం - మృదుతాలువు, కొండనాలుక వగైరాలు ధ్వనిస్థానాలు. 2. సులభంగా కదల్చడానికి వీలుగా ఉంటూ, ఉచ్చారణా స్థానాలను సోకగలిగి, ధ్వన్యుత్పాదనను కలిగించడానికి వాడబడేభాగాలు ఉచ్చారణా కరణాలు, లేక ధ్వనికరణాలు (articulators). ఇవి ధ్వనిమార్గంయొక్క క్రిందిభాగంలో ఉంటాయి. క్రిందిపెదవి, నాలుకయొక్క వివిధభాగాలు - అంటే కొననాలుక లేక జిహ్వాగ్రం, పూర్వ మధ్యభాగం, మధ్యభాగం, వెనుకభాగం - అంటే జిహ్వామూలం ఇవన్నీ కరణాలు. ఈ ధ్వనికరణాలు భిన్నధ్వనిస్థానాలను తాకడమో లేక సమీపించడమో మూలంగా భిన్నభిన్నధ్వనులు ఉత్పన్నమౌతున్నాయి. ఒకధ్వనిని వర్ణించేటప్పుడు కరణాన్ని, స్థానాన్ని క్రమంగా వివక్షలోకి తీసికొని వర్ణించాలి. ఉదాహరణకు 'త్' అన్నధ్వనిని ఉచ్చరించేటపుడు కొననాలుక అంటే జిహ్వాగ్రభాగాన్ని, పై పళ్ళకు బలంగా తాకించి, వాయుమార్గాన్ని ఆపి వదలుతూ ఉచ్చరిస్తున్నాము కనుక, ఈ ధ్వని జిహ్వాగ్రదంత్యము (Apico dental) అని వర్ణింపబడుతుంది. కాని సామాన్యంగా, ప్రత్యేక పరిస్థితుల్లోతప్ప, ధ్వనిస్థానాన్నిమాత్రమే వివక్షలో తీసికొనడం పరిపాటి కాబట్టి దీన్ని దంత్యము (dental) అనిమాత్రమే వర్ణిస్తాము. అలాగే పెదవులకలయికచే ఉత్పన్నమౌతున్న 'ప' వర్గధ్వనులు ఓష్ఠ్యములు. మూర్ధన్యభాగాన్ని నాలుక కొనచే తాకడంవల్ల ఉత్పన్నమౌతున్న 'ట' వర్గధ్వనులు మూర్ధన్యములు. మృదుతాలువును జిహ్వామూలంతో తాకడంవలన ఉత్పన్నమౌతున్న ధ్వనులు మృదుతాలవ్యములు లేక కంఠ్యములు.

పైన మనమిచ్చిన పేర్లన్నీ, ఆయా ధ్వనుల ఉచ్చారణాస్థానాన్ని అనుసరించి ఏర్పడ్డాయి. ధ్వనివర్ణనలో వివక్షలోకి తీసికోవాల్సిన ఇంకొకపద్ధతికూడ ఉంది. ఉచ్చారణాస్థానాన్నిబట్టి మాత్రమేకాకుండా, ఉచ్చారణావిధానాన్నిబట్టికూడ ధ్వనులను వర్ణించవచ్చు.

వాయుమార్గంలో ధ్వన్యంగాలవల్ల ఏర్పడే ఆటంకాలమూలంగానో, మార్పుల మూలంగానో ధ్వనులు ఉత్పన్నమౌతున్నాయని మొదటో చెప్పాము, ఆ ఆటంక, పరివర్తనాదులనే ఉచ్చారణావిధానం (manner of articulation) అని పిలుస్తాము. ఉదాహరణకు, ప, త, ట, క వంటి ధ్వనులను ఉచ్చరించేటప్పుడు, శ్వాసకోశాలనుండి వెలికి వస్తున్నగాలిని - అంటే బహిర్వర్తవాయుమార్గాన్ని, ఆయా స్థానాలవద్ద కరణాలచే కొద్దిపాటి సమయం సంపూర్ణంగా ఆపి వదులుతున్నాం కాబట్టి, ఆ ధ్వనులను Stops-స్పర్శములు అని పిలువవచ్చు. వీటినే కొందరు స్ఫోటకములు (Plosives) అని కూడ అంటారు. మ, న, ణ, ఞ, ఙ వంటి ధ్వనులను పలుకుతున్నప్పుడు ఒకవైపు నోటిలో ఆయా స్థానాలవద్ద వాయుమార్గాన్ని ఆపుతూ, ఇంకొకవైపు నాసికామార్గం గుండా గాలిని వదులుతున్నాం కాబట్టి, వీటిని అనునాసికాస్పర్శములు (nasal stops) అని పిలుస్తారు. అయితే సామాన్యంగా అనునాసికలు (nasals) అనిమాత్రమే పిలవడం కద్దు. అనునాసికలుతప్ప మిగిలిన స్పర్శాల ఉచ్చారణలో - అంటే ప, బ, త, ద, ట, డ, క, గ ల ఉచ్చారణలో నాసికాద్వారం సంపూర్ణంగా మూయబడి ఉంటుంది.

వాయుమార్గంలో ఏదో ఒకస్థానంవద్ద ఆటంకం ఏర్పడి, ఆ ఆటంకితభాగానికి ఒకప్రక్కగుండానో, లేక రెండుప్రక్కలగుండానో గాలి వెలికివస్తే, ఆ విధానంలో ఉచ్చరింపబడే ధ్వనులను పార్శ్వికములు (Laterals) అంటారు. ఉదాహరణకు 'ల్' అన్నధ్వనిని చూద్దాము. దీన్ని ఉచ్చరించేటప్పుడు, నాలుక వర్త్సస్థానాన్ని సోకుతూ బహిర్వర్తవాయుమార్గాన్ని ఆటంకపరచగా, నాలుకయొక్క ఇరుపార్శ్వాలగుండా గాలి వెలికివస్తూ 'ల్' అన్నధ్వని పుడుతోంది. కనుక ఉచ్చారణ విధానాన్నిబట్టి వర్ణించేటప్పుడు దీన్ని పార్శ్వికము అని పిలవాలి. ఉచ్చారణస్థానాన్నిబట్టి అయితే ఇది వర్త్స్యమౌతుంది.

ఇప్పుడు ఆంగ్లంలోని 'ర్' అన్నధ్వనిని చూద్దాము. దీన్ని పలికేటప్పుడు జిహ్వాగ్రభాగం మూర్ధన్యస్థలాన్ని పలుమార్లు సోకుతూ కంపనాన్ని పొందుతుంది. తొలిసారి సోకగానే గాలి వేగంచేత వెనక్కితగ్గి, మళ్ళీ ముందుకు వెళ్ళి సోకుతూ ఇలా కంపనాన్ని పొందుతుంది. ఇలాటివిధానంలో ఉచ్చరింపబడుతున్నది కనుక దీన్ని కంపితము

(Trill) అని పిలుస్తారు. ధ్వనికరణము, ధ్వనిస్థానాన్ని తాకడంలో కంపనాన్ని పొందగా ఉత్పన్నమయ్యేధ్వనులు కంపితములు. వీనినే లోడితములు (rolled) అనికూడ అంటారు. అయితే మనం తెలుగులో అరు వంటి శబ్దాల్లో సర్వసామాన్యంగా ఉచ్చరించే 'ర్' యొక్క ఉచ్చారణావిధానం వేరే. ఇక్కడ నాలుక వర్త్స్యస్థానాన్ని చటుక్కున ఒక్కమారే తాకి వెనక్కు వచ్చేస్తుంది. ఈ విధానంలో ఉత్పన్నమయ్యేధ్వనిని తాడితము (Flap) అంటారు. ఇప్పుడు శ, ష, స అన్నవాటిని చూద్దాము. ఈ ధ్వనులను ఉచ్చరించేటపుడు ధ్వనికరణము, ధ్వనిస్థానాన్ని సోకుతున్నప్పుడు సంపూర్ణంగా కాక పాక్షికంగా వాయుమార్గాన్ని నిరోధిస్తుంది. అంటే వాయుమార్గనిరోధంలో ఒక సన్నని మార్గం, సంపీడనం (groove or constriction) ఏర్పడి, దానిగుండా వాయువు వెలికి వస్తుంటుంది. ఆ సంపీడనంచేత స్పష్టంగా వినతగ్గ ఒక ఘర్షణ (friction) ఉత్పన్నమౌతున్నది - కనుక వీటిని ఘర్షకములు (Fricatives) అంటారు. కొన్ని ధ్వనులు స్పర్శములవలె ఆరంభమై, ఘర్షకములలాగ ముగింపవుతాయి. ఇలాటివాటిని ఈషత్ స్పర్శములు (affricates) అని పిలుస్తారు. ఉదాహరణకు 'చ్' అన్నధ్వని 'ట్' లాగ ఆరంభమై, 'స్' లాగ ముగుస్తుంది. ఈ స్పర్శత, ఘర్షకత అన్న రెండంశాలు ఇందులో కూడి ఉండడంవల్ల, దీన్ని ఈషత్‌స్పర్శము అని పిలుస్తారు.

ఇందాకా, ధ్వనివర్ణనలో వివక్షలోకి తీసికోవాల్సిన రెండంశాలను చూశాము. అవి 1. ఉచ్చారణాస్థానం. 2. ఉచ్చారణావిధానం. ఈ రెండేకాక ఇంకొకటికూడ ఉంది. అది స్వరపేటికలో ఏర్పడేమార్పుకు సంబంధించినట్టిది. స్వరపేటిక (Larynx) లో రెండు స్వరతంతువులు (Vocal chords) ఉంటాయి. ఈ స్వరతంతువులమధ్యగా నిరాటంకంగా గాలి వస్తూ పోతుండడానికి అవకాశం ఉంటుంది. ఊపిరితిత్తులనుండి వెలికి వచ్చేగాలి, వీనిమధ్యగుండా నిరాటంకంగా వస్తుండగా మనం వెల్వరచే ధ్వనులను శ్వాసములు లేక అఘోషధ్వనులు (Voiceless sounds) అని పిలుస్తాము. క్, చ్, ట్, త్, ప్ వంటివి అఘోషధ్వనులు. గ్, జ్, డ్, ద్, బ్ అన్నధ్వనులను ఉచ్చరించేటపుడు స్వరతంతువులు కంపిస్తూ, గాలిని కంపితంచేస్తాయి కనుక, ఆ కంపిత వాయుమార్గంలో వెలువడేధ్వనులు నాదములు - అథవా - ఘోషధ్వనులు (Voiced sounds). క్ అన్నదాన్ని గ్ అన్నదాన్ని చెవులు మూసికొని ఉచ్చరిస్తే చాలు. ఆ తేడా తెలుస్తుంది. గ్ అంటున్నప్పుడు ఒకవిధమైన 'గుంయ్' మన్న ధ్వని వినపడుతుంటుంది. అలాగే మిగిలిన ఘోషధ్వనులకు సంబంధించికూడ వినవచ్చు. ఆ గుంయ్ మన్నవి స్వరతంతువుల కంపనంమూలంగానే ఏర్పడుతోంది. మన కుత్తుకలో ఉబ్బె

త్తుగా ఉన్నభాగం - అక్కడనే స్వరపేటిక ఉంది - దానిమీద చేయి ఉంచుకుని ఈ ఘోషధ్వనులను ఉచ్చరిస్తే, అఘోషధ్వనులకూ వీనికీ ఉన్నతేడా సులభంగా తెలిసి వస్తుంది. ఘోషధ్వనులను పలికేటప్పుడు ఆ కృకభాగం స్పష్టంగా కదలడాన్ని గమనించవచ్చు. ఆ కదలిక స్వరతంతువుల కంపనంమూలంగానే ఏర్పడుతోంది. అచ్చులన్నీ ఘోషధ్వనులే (వాయుమార్గంలో ఎలాటి ఆటంకం లేకుండా నిరాటంకంగా వెలువడేధ్వనులు అచ్చులు. ఆటంకాలవలనకాని, తత్సంబంధమైన అన్యపరివర్తనా కార్యాలవల్లకాని ఉత్పన్నమయ్యేవి హల్లులు. అచ్చులకు సంబంధించిన సమగ్రవివరణ ఈ అనుబంధభాగంయొక్క వ్యాప్తికి మించినట్టిది)

కనుక ధ్వనులవర్ణనలో వివక్షలో ఉంచుకోవాల్సిన మూడంశాలు ఇవి: 1. ఉచ్చారణాస్థాన, కరణ సన్నికర్ష. 2. ఉచ్చారణావిధానం. 3. స్వరతంతు పరివర్తనా ప్రభావం. క్రమం తప్పకుండా ఈ మూటినీ తప్పనిసరిగా వివక్షలో ఉంచుకొనే ధ్వనులను వర్ణించాలన్న నిబంధన కాని, పరిపాటి కాని లేవు. ఇప్పుడు తెలుగులోఉన్న వ్యంజనధ్వనులనుమాత్రము వర్ణిద్దాము.

ప్—అఘోష, ఓష్ఠ్య, స్పర్శము (Voiceless, bilabial, stop)
బ్—ఘోష ఓష్ఠ్య స్పర్శము (Voiced bilabial stop)
త్—అఘోష దంత్య స్పర్శము (Voiceless dental stop)
ద్—ఘోష దంత్య స్పర్శము (Voiced dental stop)
ట్—అఘోష మూర్ధన్య స్పర్శము (Voiceless retroflex stop)
డ్—ఘోష మూర్ధన్య స్పర్శము (Voiced retroflex stop)
ౘ్—అఘోష వర్త్స్య ఈషత్ స్పర్శము (Voiceless alveolar affricate)
ౙ్—ఘోష వర్త్స్య ఈషత్ స్పర్శము (Voiced alveolar affricate)
చ్—అఘోష తాలవ్య ఈషత్ స్పర్శము (Voiceless palatal affricate)
జ్—ఘోష తాలవ్య ఈషత్ స్పర్శము (Voiced palatal affricate)
క్—అఘోష కంఠ్య స్పర్శము (Voiceless velar stop)
గ్—ఘోష కంఠ్య స్పర్శము (Voiced velar stop)
మ్—అఘోష ఓష్ఠ్య అనునాసికము (Vocied bilabial nasal)
న్—ఘోష దంత్య అనునాసికము (Voiced dental nasal)
న్—ఘోష వర్త్స్య అనునాసికము (Voiced alveolar nasal)
ణ్—ఘోష మూర్ధన్య అనునాసికము (Voiced retroflex nasal)

ఞ్—ఘోష తాలవ్య అనునాసికము (Voiced palatal nasal)
ఙ్—ఘోష కంఠ్య అనునాసికము (Voiced velar nasal)
స్—అఘోష వర్త్స్య ఘర్షకము (Voiceless alveolar fricative)
శ్—అఘోష తాలవ్య ఘర్షకము (Voiceless palatal fricative)
ష్—అఘోష మూర్ధన్య ఘర్షకము (Voiceless retroflex fricative)
హ్—అఘోష కాకల్య ఘర్షకము (Voiceless glottal fricative)
ల్—ఘోష వర్త్స్య పార్శ్వికము (Voiced alveolar lateral)
ళ్—ఘోష మూర్ధన్య పార్శ్వికము (Voiced retroflex lateral)
ర్—ఘోష వర్త్స్య తాడితము (Voiced alveolar flap)
ఱ్—ఘోష మూర్ధన్య తాడితము (Voiced retroflex flap)
వ్—ఘోష ఓష్ఠ్య అఘర్షక నిరంతరితము (Voiced bilabial frictionless
(W) (కాలువ, రేవువంటిపదాల్లో వినపడేది) continuant)
వ్—ఘోష ఓష్ఠదంత్య అఘర్షక నిరంతరితము (Voiced labio dental
(V) (వీణ, వీపువంటిపదాల్లో వినపడేది) frictionless continuant)
య్—ఘోష తాలవ్య అఘర్షక నిరంతరితము (Voiced palatal fricrionlesst
continuan)

.... .... ....

ఈ ధ్వనులేకాకుండా శ్రుతి, ఊనిక, స్థాయి (Pitch, stress, tone) అన్న అవిభాజకధ్వనులు (Supra segmentals), లొట్టలు (Clicks), అస్పష్టధ్వని (Whisper), మర్మరధ్వని (Murmer) వంటివికూడ ఈ ధ్వనిశాస్త్రంలో వివేచనకు వస్తాయి. అయితే వాటివర్ణన ప్రస్తుతపరిమితికి అతీతమైనట్టిది.

ధ్వనులనుగురించి ఇలా ఎంత వర్ణించినా ప్రయోజనం ఉండదు. వివిధధ్వనులను, ధ్వనులకు అనుగుణంగా వ్రాయబడే ధ్వన్యాలేఖనమును (Phonetic transcription) సుశిక్షితుడైన వ్యక్తివద్ద ప్రత్యక్షంగా అభ్యసించడంలోనే ఫలం అధికంగా ఉంటుంది. తమాషా ఏమిటంటే, ఇలాటి ఈ ధ్వనిశాస్త్రం, కొంతమంది భాషావేత్తల ప్రకారం భాషాశాస్త్రంలో నిరుపయోగకరమైన భాగం. మరికొంతమేరకు ఇది చాలా మహనీయకరమైన విభాగం.